**10-04-24 to 12-05-24**

# వారాణసి శ్రీ రామ కృష్ణ

## {అమరావతి }

## కథలు కబుర్లు విషయాలు






**1.ధ్వజ స్తంభం కవర్లు-- కాలి కవర్లు 12-05-24**

మూడు చక్రాల స్కూటీ వేసుకొని మా వీధి లోకి ఒచ్చాడు ఒకాయన . అయన బండికి బిగించి పెట్టిన మైకు ఇట్లాగా ఆరు స్తోంది . " మిక్సీ కవర్లు ,ఫ్రిజ్ కవర్ లు , టీవీ కవర్లు , ధ్వజ స్తంభం కవర్లు-- కాలు కవర్లు "

నీనేను పెళ్లి ఆసక్తిగా " ధ్వజ స్తంభం కవర్లు-- కాలు కవర్లు ఏమిటి కొత్తగా?" అని అడిగాను .

"ఎంతో మంది మీలా అడిగారండి ? అడిగిన వారందరికీ వివరాలు చెప్పుకుంటూ పోతే నేను బ్రతికేదెట్టా ? ఒక ఫ్రిజ్ కవరు కొనండి వివరాలు వినండి "

"సరే ఇవ్వు - ఇదిగో డబ్బు "

అతడు ఇలా చెప్పుకొచ్చాడు " సార్ చాలా మంది ఇండ్లు కట్టుకొని అందులో ఒక దేముని మందిరం కట్టు కుంటున్నారు . దానిలో బంగారు విగ్రహాలు కూడా పెట్టుకుంటున్నారు . దానికి దేవాలయం తలుపులను పోలిన తలుపులు , గంటలు కూడా పెట్టిస్తున్నారు . ఇప్పుడ్డు అది పాత ఫాషన్ అయి

పోయి  ఆ గుడుల ముందు ధ్వజ స్తంభాలు పెట్టటం అనే కొత్త ఫాషన్ వచ్చింది . ఇప్పుడు ఆ  ఇళ్ల వారు  - బంగారపవో , వెండివో , ఇత్తడివో , రాగివో  ధ్వజ స్తంబాలు చేయించి వాటిని తమ పూజ మందిరాల ముందు నిలబెట్టు కుంటున్నారు . ఇవి మూర,  బార , అతి బార అంటే తల ఎత్తు  సైజుల్లో మాత్రమే పెట్టుకోవాలని ఎవరో సిద్ధాంతి "ఓం"  టీవీ లో చెప్పాట్ట . అప్పటి నుండి జనం ఆవే సైజు ధ్వజ స్తంభాలు పెట్టుకుంటున్నారు . వాటికి తగ్గట్టు మేము కవర్లు  కుట్టించి అమ్ముతున్నాము ,"

" బలే వుంది " అన్నాను మెచ్చుకోలుగా.

"వెళ్ళొస్తాను సార్" అని అతడు ముందుకు కది లాడు . నేను అతని జబ్బని బిగించి లాగి పెట్టి ఆపాను . " కాలి కవర్లు అన్నావు వాటి సంగతి ఏమిటో చెప్పవూ ?అని అడిగాను .

" ఓ మిక్సీ కవరు కొనుక్కోండి.  అది కూడా చెబుతాను " అనిన అతడు నేను కొన్నాక ఇట్లా చెప్పాడు ."నేను మూడు కాళ్ళ బండి మీద వచ్చాను కాబట్టి మీరు పోల్చుకుంటారు అనుకున్నానండి . నాకు రెండు కాళ్ళూ లేవు . చెక్క కాళ్ళు పెట్టుకున్నాను . దానిమీద ఒక కవర్ వేసుకున్నాను . మీకు చూడటానికి అచ్చు మనిషి కాళ్లకు మల్లె కనిపించాయి కదా

? అందుకే మీరు పోల్చుకో లేక పోయినారు - మీ పొరపాటు ఏమీ లేదు లెండి . లేటెస్ట్ టెక్నాలజీ మహిమ ఇది "

" అవునోయి-- నీకాలు ఎలాపోయింది ?"

" నాది ఒరిజినల్ గా రైల్వే  కి భోజనాలు సప్లై చేసే బిజినెస్ అండీ . గుప్పెడు మెతుకులు , గుంటెడు నీళ్ల పప్పు , పచ్చి బంగాళా దుంపల మీద పసుపు చల్లి చేసిన కూర , రంగునీళ్ల సాంబారు - జనానికి పెట్టి లక్షలు సంపాదించాను . ఎందరి ఉసురు తగిలిందో ఏమో .. ఎదో ఒక రైలు కింద పడి రొండు కాళ్ళూ ఇచ్చేసి - ప్రాణాలు ఉంచుకొని బయట పడ్డాను _ అదంతా ఓ విషాద గాధ లెండి . ఇహ మంచిగా బ్రతుకు దామని ఈ బిజినెస్ పట్టుకున్నాను "

" కాళ్ళ కవర్ల కి అమ్మకాలు ఉన్నావా ?

"' ఎందుకుండవండీ.. రైల్వే భోజనం తిన్న వాడు - బస్సు స్టాండ్ భోజనము తిన్న  వాడు శాపనార్ధాలు పెట్టక వదలరు కదా ? పెద్దల సంగతి వదిలేయండి . వారితో పాటు ఉన్న చిన్నపిల్లలు ఆ భోజనం రుచి చూసి ఎంత ఉసూరు మంటారో ఆలోచించండి . ఆలాంటి ఉసురు  తగిలి ఇప్పటికే చాలా మంది కాళ్ళూ విరిగాయి. నేను ఈ కాలి కవర్లు అమ్మేటపుడు వారి విషయాలు కనుక్కుంటాను కాబట్టి నాకు తెలుసు "

" అదే నిజము అయితే రైల్వే భోజనం/ టిఫిన్  కోట్లమంది తింటారు . లక్షల మంది అమ్మతారు  .వేలాది రైల్వే స్టేషన్స్ ఉంటవి  అయితే మన వూరు జిజియా వాడ రైల్వే స్టేషన్ లో భోజనాలు అమ్మి కాళ్లు పోటోట్టుకున్న వారు ఐదారు వేలమంది ఉండాలనే ?  వున్నారంటావా ?"

" మీ అంచనా కరెక్ట్   సారు .  కానీ దీనికి అదనంగా "స్త్రీలకూ వృద్దులకు ఉన్న అసహాయత ఆధారంగా అధిక కిరాయి వసూలు చేసే  ఆటో వాలాలని   కలుపుకోవాలి సారు  . అంతా కలిసి  . మన జిజియా వాడలో   ఫది పన్నెండు వేల మంది వుంటారు .అదే మైదరా బాదులో పాతిక వేల మంది కూడా వుంటారు అని నా అంచనా " అని అతడు అన్నాను .

"సరే ఈ పూటకి నాకీ  సంగతులు చాలు . నువ్వు మళ్ళీ రేపు రా .." అని చెప్పి అతన్ని వదిలేసాను .రేపటి  సంగతులు రేపు చెపుతాను .  ఒకే .

వారణాసి శ్రీరామ  కృష్ణ ఆఫ్ అమరావతి సొంత కథ

—-----------------------------------------------------

**2.**రెవిన్యూ స్టాంప్       **03-05-24**




రెవిన్యూ స్టాంపును ఇంగ్లాండ్ వారు 17 వ శతాబ్దం లో ప్రెవేశ పెట్టారు . దీనిని రెవిన్యూ ఫిస్కల్ స్టాంప్ {= అనగా "ఇప్పుడు జరిగిన ఈ పని నుండి ప్రభుత్వానికి అందవలసిన ఆదాయం అందింది" అని నిర్ధారించే స్టాంపు} అంటారు . తపాలా కవర్ల మీద వాడే స్టాంపులను postal fiscal. స్టాంపులు అంటారు . ఆంటే మీ ఉత్తరాన్ని బట్వాడా చేయటం కొరకు ప్రబుత్వము వారికి ముట్ట వలసిన సొమ్ము ముట్టినది అని చెప్పే స్టాంపు . పూర్వము రేడియో లైసెన్సు అనేది ఉండేది . ఈ లైసెన్సు కోసము అని పోస్టల్ డిపార్ట్మెంట్ వారిని

కలవాలి . వారు ఒక పుస్తకంలో కొన్ని స్టాంపులు అంటిచి దానిపై ఎదో ముద్ర కొట్టి ఇచ్చేవారు . అది రేడియో లైసెన్సు అయ్యేది . రేడియో ఉన్న  ప్రతి వారు "Broadcast Receiver's Licence " అనే ఈ  రేడియో లైసెన్సు కొనుక్కోవాలని రూలు . 1960 వరకూ ఇది సంవత్సరానికి ఫది రూపాయలు - 1970  వరకూ సంవత్సరానికి 15 రూపాయలు . 1991 నుండీ రేడియో లైసెన్సు రద్దు అయిపొయింది .ఒక ఎలక్షన్ వాగ్దానం ద్వారా ఇందిరా గాంధీ దీనిని రద్దు చేసిందని నాకు గుర్తు .  1991  కి ముందు - మీ  ఇంటిలోనుండి రేడియో వినపడుతూ ఉంటే - ఎవరో ఒకాయన మీ ఇంటిలోనికి వచ్చి  "ఏదీ  మీ రేడియో  లైసెన్సు చూపించండి " అని డిమాండ్ గా అడిగే వారు .వారిని ఏమని అనే వారో నాకు తెలీదు . తెలిసిన వారు చెప్పండి . లైసెన్సు లు చాలా మందికి ఉండేవి కావు . లైసెన్సు ఉండాలి అని తెలిసిన వారు  - ఆ రేడియోలని చాలా చిన్న సౌండ్ లో పెట్టుకుని తప్పించుకునే వారు . .రెవిన్యూ స్టాంపులు కూడా పోస్ట్ ఆఫీస్ వారే అమ్ముతారు . అయితే ఆ ఆదాయము పోస్టల్ వారికి కాకా భారత రెవిన్యూ డిపార్ట్ మెంటుకు వెడుతుంది .కొన్ని దేశాలలో

పోస్టల్ స్టాంప్ బదులు రెవిన్యూ స్టాంపు - రెవిన్యూ స్టాంప్ బదులు పోస్టల్ స్టాంపు వాడుకో వచ్చు . కాగితాల మీద రాత కోతలు జరిగినపుడు , పొగాకు చుట్టలు , పేక ముక్కలు, వేట తుపాకీ లైసెన్సు, మద్యపు బాటిళ్లు , తుపాకీ రిజిస్ట్రేషన్ , వంటి వాటి విషయంలో రెవిన్యూ స్టాంప్ వాడాలని బ్రిటీష్ వారి రూలు . ఒక్కో సారి ప్రభుత్వము అడగక పోయినా గానీ వ్యక్తులే- రెవిన్యూ స్టాంపులు కొని వాటిని కాగితము మీద అతికించి -" నేను చేసిన ఈ పని వల్లప్రభుత్వానికి ముట్ట వలసిన ఆదాయము ముట్టింది" అని నిర్ధారించాలి { రేడియో లైసెన్సు లో వాడే స్టాంపులు - మీ లైసెన్సు కట్టండి అని ఎవరూ వచ్చి అడగరు - మనమే బాధ్యత పడి కట్టుకోవాలి } . ఇక పేక ముక్కలపెట్టెలు , పొగాకు చుట్టల విషయానికి వస్తే , వాటి తయారీ దారులే ఈ రెవిన్యూ స్టాంప్ కొని ఆ వస్తువుల పై అంటించాలి . పేక సెట్లు , మందు బాటిల్సు , చుట్టలు వంటి వాటిని ఎవరన్నా విదేశాల నుండి అక్రమంగా{ బ్లాక్ మార్కెట్ ద్వారా } దిగుమతి చేసుకున్నారు అనుకోండి . వాటి మీద ప్రభుత్వానికి ఆదాయం ఏమీ రాలేదు కదా ? వాటిని

చూడగానే ఇది బ్లాక్ మార్కెట్ సరుకు అని పోలీసు వారికి ఎట్లా తెలుస్తుంది ? అంటే వాటి మీద ఉండాల్సిన రెవిన్యూ స్టాంపు లేకపోతే తెలుస్తుంది . స్టాంప్ లేని దానిని పోలీసులు స్వాధీనం చేసుకుంటారు . అక్రమంగా దిగు మతి చేసుకున్నాక అయినా సరే దానిమీద ఉండాల్సిన రకంవి , తగినన్ని రెవిన్యూ స్టాంపులు అంటించితే అది సక్రమమైన దిగుమతిగా మారుతుంది . ఆ స్టాంప్ కనపడితే పోలీసులు ఊరుకుంటారు . ఇలాగా ఒక అక్రమాన్ని సక్రమం చేస్తూ ఆదాయము తెచ్చి పెట్టేటందుకుప్రభుత్వానికి, మరియూ అక్రమాన్ని సక్రమం చేసుకుని జైళ్లకు పోకుండా ఉండటానికై ప్రజలకు ఈ రెవిన్యూ స్టాంపులు ఉపయోగపడ్డవి . నా చిన్నతనం లో పేక పెట్టెలు అమ్మేవారు - పొగాకు చుట్టలు అమ్మే వారు వాటిని కొంత రహస్యంగా అమ్మే వారు . కారణం వాటి బాక్స్ ల మీద ఉండాల్సిన రెవిన్యూ స్టాంప్ లేక పోవటమే కారణము అయివుంటుందని ఇప్పుడు అనుకుంటూ వున్నాను . ఇప్పుడు కూడా కిళ్లీ కోట్లలో పేక ముక్కల పెట్టె మరీ బహిరంగంగా అమ్మరు . రెవిన్యూ స్టాంప్ ద్వారా వసూలు చేసేది పన్ను కాదు . సుంకము

అవుతుంది .    రెవిన్యూ స్టాంప్ కు ఇంగ్లాండ్ వారే పితామహులు కారు . దీనిని మొదటిగా టర్కీ లో వున్నా Ottoman Empire,చక్రవర్తులు  Damga resmi  పేరిట ప్రవేశ పెట్టి వసూలు చేశారు .తుర్కీ  దేశంలోకి దిగుమతి ఐన పట్టు దారపు కండెలపై ప్రభుత్వానికి ముట్టాల్సిన సుంకం ముట్టినదా లేదా తెలుసుకోవటానికి ఈ పద్ధతి ప్రెవేశ పెట్టారు. ఇంగ్లాండ్ వారే రెవిన్యూ మరియూ పోస్టల్ స్టాంపులను రెండు వేరు వేరు రూపాలలో  ప్రవేశపెట్టారు . ఇంగ్లాండ్ ని అనుకరించి రెవిన్యూ స్టాంపులు విడుదల చేసిన ఇతర  దేశాల వారు పోస్టల్ స్టాంపునే రెవిన్యూ స్టాంపుగా కూడా వాడుకో మన్నారు .   ఇంగ్లాండ్ వారి రెవిన్యూ స్టాంపులు రెండు రకాలు . ఒకటి కాగితం మీద అంటించటానికి వీలైనది . ఇంకొకటేమో కాగితం మీద ముద్ర కొట్టటానికి వీలైనస్టాంప్ .   రెవిన్యూ స్టాంప్ ని vice versa.స్టాంప్ అని కూడా అంటారు . అనగా మీరు ప్రభుత్వానికి డబ్బు కట్టటమే కాకుండా ఒకవేళ ప్రభుత్వము,  మీకేమన్నా డబ్బులు వాపసు  ఇవ్వవలసి ఉంటే,  దాన్ని డబ్బురూపకంగా  కాక ఈ రెవిన్యూ స్టాంప్ లు  ఇచ్చి సరిపెట్టవచ్చు  .  నాచిన్న తనం లో,  ఒక టీచర్

గారికి ఇవ్వవలిసిన డీఏ బకాయిల నిమిత్తం రొండు రూపాయల విలువగల రెవిన్యూ స్టాంపులు పంపారని చెప్పుకోవటం విన్నాను .అప్పట్లలో జీతం తీసుకునే వారందరూ రెవిన్యూ స్టాంప్ అంటించి సంతకం చేయాల్సి ఉండేది కాబట్టి . ఆ టీచర్ గారు ఆ స్టాంప్ లను తోటి టీచర్లకు అమ్మే తిప్పలు పడి సొమ్ము చేసుకున్నాడు . . మొదటిలో ఈ స్టాంపులను ప్రభుత్వ ఆదాయం కోసం ప్రవేశ పెట్టినా గానీ -వీటి మీద ప్రజలకున్న అభిప్రాయాలు అనేక రకాలుగా మారాయి . ప్రభుత్వం మరియూ ప్రజల మధ్య ఎదో స్నేహ పూర్వక సంభందం వున్నది అని సూచించటానికి కూడా ఈ స్టాంపులు ఉపయోగ పడతవి అని ప్రజలు అనుకున్నారు .ఉదాహరణకు - మీరు జీతం తీసుకుంటూ ఒక రూపాయి రెవిన్యూ స్టాంప్ అం టించటానికి తిరసకరిస్తే, ఏమవుతుంది ? మీరు ప్రభుత్వానికి నిరసన తెలిపి నట్లు- ప్రభుత్వంతో ఘర్షణకు దిగినట్లు భావింప బడుతుంది . ముందుగా మీ జీతము ఆపి వేస్తారు . స్టాంపు లేకుండా చెల్లింపుజరిగిన జీతము విషయమై తదుపరి రోజుల్లో ఏదన్నా వివాదము వస్తే - ప్రభుత్వము మీకు అనుకూలంగా స్పందించదు .

ఎందుకంటే మీరు వారి స్నేహాన్ని వదులుకున్నారు కదా ?
ఏమో ముందు ముందు మనకు ప్రభుత్వముతో ఏమి పని
రావచ్చునో అనే భయం కొద్దీ కూడా మనము జీతము
కోసము రెవిన్యూ స్టాంప్ ని వాడాము. ఈ రూలు
వ్యతిరేకించటానికి కూడా మనము ఇంగిలీషు వారి
ముందు దడిచాము . రెవిన్యూ స్టాంపులు బహిష్కరించి
ఆంగ్లేయుల పై నిరసన తెలపండి అని ఎవరూ పిలుపు
ఇవ్వలేదు , " మీరు ఈ కాగితం మీద అంటించవలసిన
రెవిన్యూ స్టాంప్ అంటించలేదు . అందుకని మీ
వ్యవహారంతో ప్రభుత్వము వారికి సంభందం లేదు " అని
ఒక తాలూకా ఆఫీసు గుమస్తా అంటే మీరేమి చేయ గలరు
చెప్పండీ ? జనము దీనికి భయ పడ్డారు .. మనకూ -
మరొకరికి మధ్య నడిచిన వ్యవహారంలో - ముందు
ముందు రోజుల్లో ప్రభుత్వ జోక్యం కొరవలసి వస్తుందేమో
అన్న అనుమానం వచ్చి నపుడు , ఒక రెవిన్యూ అంటించి
పడేయటం -కూడా జనం అలవాటు చేసుకున్నారు .
ఒక రెవిన్యూ స్టాంప్ ని కనుక ప్రామిసరీ నోటు మీద
అంటించి పెడితే " ఈ వ్యవహారంలో ప్రభుత్వము వారికి
చెల్లించ వలసిన సుంకములో కొంత ముందుగానే చెల్లింపు

బడింది " అని వాదన చెప్పటానికి వీలుగా - ఉంటుందని ప్రామిసరీ నోట్ల మీద రెవిన్యూ స్టాంపులు అంటించ సాగారు . మీ దెగ్గర ఒక తుపాకీ వున్నది . దానికి ఎవరూ లైసెన్సు ఇవ్వటం లేదు . అలాంటపుడు తుపాకీ లైసెన్సు మీద ఉండాల్సిన రెవిన్యూ స్టాంప్ ఏమిటో అనేది తెలుసుకొని - వాటిని ఎక్కడినుండి అయినా దొంగిలించి అయినా సరే తెచ్చుకుని ఆ స్టాంపును మీ తుపాకీ కాగితాల మీద అంటించు కుంటే మీకు లైసెన్సు వచ్చినట్లే . ఎందుకంటే కొన్ని కొన్ని సార్లు " రెవిన్యూ స్టాంప్ " అన్నది "పర్మిషన్ గ్రాంటెడ్ "అన్న మాటకు ఇంకో రూపము గా కూడా భావింపబడుతుంది . ప్రభుత్వము వారు ఇంత అని సుంకము కట్టించుకొని- ఏదన్న ఒక స్టాంపు ఇచ్చినా లేకఒక స్టాంపు గుద్దినా - అది పర్మిషన్ గ్రాంటెడ్ కింద లెక్క .మీరు సరైనన్ని పోస్టల్ స్టాంపులు కవరు మీద టించితేనే మీ కవరు మీద పోస్టల్ ముద్ర పడుతుంది . ఈ ముద్ర " పెర్మిటెడ్ టూ డెలివర్ " అని చెపుతుంది . తగినన్ని పోస్టల్ స్టాంపులు లేనపుడు " డ్యూ " అనే ముద్ర పడుతుంది . అనగా "సొమ్ము వసూలు చేసి డెలివరీ చేయటానికి అనుమతించబడింది" అని ఈ ముద్ర

అర్ధము.   నేడు 5000 ? అంతకు తక్కువ కి రెవిన్యూ స్టాంప్ వాడనక్కరలేదు . రెవిన్యూ స్టాంపు లేని పేమెంట్ / రిసీప్ట్ ను ఇన్కమ్ టాక్స్ వారు ఒప్పుకోరు .
సేకరణ  వారాణసి శ్రీ రామకృష్ణ ఆఫ్ అమరావతి     ముద్ర అర్ధము

—------------------------------------------------------

**3.**ఏదన్నా ఒక ప్రేమ కథ  .                         **2-5-24**

.

ఏదన్నా ఒక ప్రేమ కథ రాద్దాము అని చాలా రోజులుగా గా అనుకుంటూ ఉంటే నేటికీ ఇద్దరు ప్రేమికులు నా దృష్టిలో కి వచ్చారు . ఒక అమ్మాయి ఒక  అబ్బాయి ప్రేమవివాహము చేసుకున్నారు . కాపురము ప్రారంభించాబు . వారు కడు పేదలు. కొండరాళ్లను కంకర కొట్టి జీవిస్తాడు మన అబ్బాయి . తాను పూయించిన పూలు  తన భార్య కొప్పుకుఅందము కావాలి అన్న  ప్రేమతో -అబ్బాయి కొన్ని పూల మొక్కలు నాటాడు . ఒక  రకము చెట్టు పూలు పూయని కాలములో ఇంకో రకం చెట్టు పూలు పూసే టట్లు అతను మొక్కల్ని ఎన్నిక చేసి , సాకాడు.  భార్యకు కానీ పెట్టి పూలు కొనలేక ఈ

పని చేసాడని పక్కింటి వారు అన్నారు. ఇలాంటి అవహేళనలు అతన్ని ఉగ్ర నర్సింహుడిని చేసేవి .

" నీకు ఏదన్నా ఒక బ్రతుకు తెరువు చూపుతాను - నువ్వు రావలిసింది" అని, తన పెదతండ్రి కబురు చేయటంతో మనవాడు భార్యను విడిచి దూరదేశం వెళ్ళాడు . కొద్దీ రోజుల పిదప ఆ భార్య . తన భర్తను ఉద్దేశించి ఒక లేఖని రాసి - ఆ లేఖతో పాటు తమ చెట్లకు పూసిన పూలను - జత పరిచి, "ఈ పూల సౌరభము నీ ఊపిరి వాసనల ను గుర్తుకు తెస్తున్నది " అని రాస్తుంది .
ఈ కుర్రవాడు ఆలేఖకు బదులుగా తన భార్యకు ఒక బంగారు నగ పంపుదాము అనుకుంటాడు . డబ్బులు లేక తన పెదతండ్రిని అప్పు అడిగి ఆ సొమ్ము పెట్టి ఒక నగ కొని భార్యకు పంపుతాడు . ఈ సంగతి మనవాడు పెదతండ్రి కొడుక్కి, తెలుస్తుంది . వాడొక దుష్టుడు ." మా దగ్గర అప్పుచేసి భార్యకు నగలు కొనటం మగలక్షణం కాదు . నీదో చెత్త ప్రేమ. నిజమైన ప్రేమ ఉంటే కొండలు బండలు పగలకొట్టి సంపాదించాలి " అని ఆ దుష్టుడు మన వాడిని

ఆక్షేపిస్తాడు . ఈ దుష్టుడు  గాడు , తన తమ్ముని భార్య యొక్కఅందము    గురించి విని వున్నాడు .

 మనవాడిని బాగా రెచ్చగొట్టి,  అతడు విపరీతంగా పని చేసేటట్లు  ,  ఆవిపరీతమైన  పని వల్ల వచ్చిన అనారోగ్యముతో మరణించేట్లు  చూసి  .తన తమ్ముని భార్యను తన స్వంతము చేసుకోవటమే   ఈ దుష్టుడి ఉద్దేశ్యము .ఈ ఉద్దేశ్యము తో   దుష్టుడు , తన   తమ్ముని అనేక సార్లు రెచ్చగొట్టుతూ వస్తూ వున్నాడు  . బాగా  హేళన కు గురై  ,ఆపై  బాగా రెచ్చగొట్టబడి - ఒక నాడు మన వాడు తన అన్న తన చేతిలో వున్న  సుత్తి తో , దుష్టుడికి  తలపై బాది చంపివేసాడు . ఇది అనుకోకుండా జరిగిన హత్య . కానీ హత్య నేరానికి గానూ మనవాడికి 14  యేండ్ల కఠిన కారాగార శిక్ష  పడుతుంది .

ఆనాటి పద్దతుల ప్రకాము భార్య భర్తలు ఒకరినొకరు చూసు కోవటానికి అని జైలు అధికారులు ఒకే ఒక అవకాశం ఇస్తారు .

" నేను ఆ పూల వుత్తరం పంపక పోయి ఉండాల్సింది . నీవు నామీద వున్న పిచ్చి ప్రేమతో  జైలు పాలినావు నావు ' అని భార్య దుఃఖిస్తుంది . అది ఆమె ప్రేమ.

" నేను కోపం తెచ్చుకోకుండా వుండాల్సింది . నేను రెచ్చి పోకుండా ఉండ వలసింది . నామూలంగా నీ జీవితము " నా జైలు జీవితముకన్నా మరింత ఘోరం గా మారింది . ఇదంతా నా వల్లనే " అని మనవాడు విలపిస్తాడు . ఇది అతని ప్రేమ .

మనవాడి భార్యవచ్చి -- తన భర్త కారాగారంలో వున్న ఊరిలోనే నివాసం ఏర్పరుచుకొని - కాయ కష్టము చేసి - భర్తకు ఇంటి భోజనం పంపుతూ ఉంటుంది . మనవాడు జైలు లో వున్నాడు కదా ? ఆ ఊరి జమీందారు గారు కొండ మీద ఒక దైవ మందిరము నిర్మిస్తూ కొండ శిఖరాన్ని చదును చేయిస్తూ వున్నాడు . అందులో బండలు పగుల కొట్టే పనిలోకి మనవాడిని జీతము లేని కూలీగా పంపారు . మనవాడు ఆ కొండ శిఖరం మీద స్వేచ్ఛను ఇచ్చే గాలిలో నుంచుని తన భార్యమీద ప్రేమ పద్యాలూ కవితలూ రాస్తాడు .రాసి, తనకు భోజనం తెచ్చినప్పుడు తన భార్యకు ఇమ్మని జైలు లోని బంటును కోరుతాడు . కాలప్రభావము వల్లనూ కష్టాలమూలంగానూ అమ్మాయి అందము అంతా హరించుకు పోతుంది .

"ఈ ఎముకల పోగు మీద ఈ ప్రేమ కవిత్వము ఏమిటి ? అని విస్తు పడుతూ ఆ బంటు ఆ ప్రేమకవిత్వాన్ని తన ఇరుగు పొరుగు వినిపించ పరిహాసంగా నవ్వుతాడు .

ఒక కవిత్వములో " నేను నీవు కలిసి జీవితాన్ని కందాము " అని అబ్బాయి రాస్తాడు . " పిల్లలని కందాము అనే బదులు " జీవితాన్ని కందాము " అని అబ్బాయి రాసిన మాటలు , ఎందరో ఆడవారి హృదయాలలోకి చేరుతాయి . వారు అతని కవిత్వానికి- - ఈ జైలు బంటు ద్వారానే బహుమానాలు పంపుతారు. ఇలా మనవాడి పేరున జైలులో చాలా బంగాబు నాణేలు జమ అయ్యి ఉంటవి . కానీ శిక్ష శిక్ష ఏ కదా ? కూలీ పనికి కొండ మీదకు పెడతాడు . మన వాడు ఒక బండరాయిని ముక్కలు కొడుతుండగా , కొన్నిరాతి ముక్కలు మనవాడి ముఖానికి తగిలి అతని రొండు కన్నులూ పోయాయి . కానీ ఆసంగతి భార్యకు తెలియ నివ్వ అన్ని కట్టు దిట్టాలు చేస్తాడు.

" రేపు నన్ను విడుదల చేస్తున్నారు . నేను చదును చేసిన చోట ఒక దైవ మందిరము నిర్మాణము అవుతూ వున్నది . అది నీవు చూదువు గాని . నీవు తప్పక రావలె " అని మనవాడు , భార్యకు కబురు పెడతాడు .

భార్య వచ్చేసరికి భర్త కళ్ళకు ఒక దకసారు వస్త్రము కట్టుకొని, తన గుడ్డి తనము దాచుకొని ."జైలు అధికారులనుండి , నీకూ చాల బంగారము ముడుతుంది . నేను లేక పోయినాక కూడా  నీవు సుఖము గా బ్రతక వచ్చును  "అని ఏమేమో చెపుతాడు .

చెప్పి " నేనొక దీక్షలో వున్నాను  . ఈ ఆలయములో దేముని విగ్రహాము యొక్క ప్రతిష్ట చూడటానికి తప్ప  నేనీ కట్టు విప్పను .  ఇందుకు ఇంకనూ మూడు రోజులు పట్టవచ్చు . నీవు కిందకు వెళ్ళి పూజా సామాగ్రి సమకూర్చుకొని రా " అని భార్యను కోరుతాడు . భార్య కిందకు వెడుతుంది ." నామూలంగా నాభార్య ఎన్నో కష్టాలు పడింది . నా గుడ్డి తనంతో ఆమె ఇంకెన్ని భాదలు పడాలో ఏమో ? నామూలకంగా ఆమె భాదలు పడటం ఎందుకు ? అన్న ప్రేమ పూర్వక ఆలోచనలతో మనవాడు కొండ శిఖరం మీద నుండి లోయలోకి దూకి ప్రాణత్యాగము చేస్తాడు .

మనవాడి భార్య పూజ సామగ్రితో వచ్చి - చివరికి భర్త మృత దేహము లోయలో పడివుండటాన్ని కనుగొని - తాను కూడా లోయలోకి దూకి అతని గుండెల మీదకు

పడుతుంది .

కొండ శిఖరము మీద నిర్మిస్తున్న మందిరాలలో  విగ్రహాలకు ప్రాణము ఇచ్చే అధికారము గల దేవత ఈ సంఘటనలు చూస్తుంది . రాతిలోకే ప్రాణాలు నింపగల ఈమె భార్య భర్తల దేహాలలోకి ప్రాణాలు నింప లేదా ? కాబట్టి భార్య భర్తలకు ప్రాణాలు పోస్తుంది . వీరు నడుచుకుంటూ కొండపైకి ఎక్కుతూ వుంటారు . వీరికి వ్యతిరేక దిశలో వున్న మార్గము మీదుగా ఆ ఆలయము నిర్మిస్తున్న జమీందారు వస్తూ వున్నాడు . ఆయనకు కొండకు అటుపక్కగా ఏవో దివ్య పరిమళాలు విరజిమ్ముతున్నట్లు తెలుస్తుంది . చూస్తూ ఉండగానే  ఎవరో ఒక భార్య భర్తలు దివ్య రూపాలతో పైకి వస్తూ వుండటము గ్రహించుతాడు . వారి కథను అడిగి తెలుసు కుంటాడు . "నేను నిర్మించే మందిరానికి - మిమ్మలను మించిన దేవీ దేవతలు ఎవరున్నారు. మీరు ఇందులో నివాసము వుండండి. అన్ని వసతులూ ఏర్పరుస్తాను  " అని ప్రార్థించి  ఆ మందిరాన్ని వారికి అంకితం ఇచ్చి వేస్తాడు . భార్య భర్తలు గుడి చుట్టూ ఓ  పూల తోట పెంచుతారు .కొండకింద పారే నదినుండి కొండమీదకు , భార్య భర్తలు వంతుల వారీగా నీరు మోస్తారు . ఈ దేవతలు నీరు పోసిన తోటలో అనేక విచిత్ర పరిమళాలు, సుందర ఆకృతులూ   కల పూలు  అనేకం

పూస్తాయి . తన భార్యను, తన భర్తనూ  నిజంగా ప్రేమించిన వారికి మాత్రమే ఆ విచిత్ర పుష్పాలు కంట పడతాయి అని. అవి  చేతికి దొరుకుతాయి అని నమ్మిక   .   తమ మధ్య వున్న ప్రేమ ఎంతటిదో అనే చెర్చ వచ్చినపుడు అది ఎంతటిదో అనేది తెలుసుకునేందుకు-  దంపతులు ఈ కొండని సందర్శించి - పూల మొక్కల్లో తమకోసము అని ఎక్కడన్నా ఏదన్నా పూవు ఉన్నదా అని వెతుకుతారు . దొరికితే ఒకరి వెనుకగా ఒకరు కొండపై నుండి కిందకు దూకుతారు ?

ఎందుకో గ్రహించండి  ?

వారణాసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి యొక్క సొంత కధ

-----------------------------------------------------------

**4.** ఓ  ప్రముఖాయన    నమః  **26-04-24**

మావూరికి -మాకు ఒక  ప్రముఖుడు   వున్నాడు .ఆయన గతంలో కేంద్ర ప్రభుత్వ ఉద్యోగి .ఇపుడు  అయన వయస్సు తొంబదికి చేరింది .ఇంకనూ నడుస్తూనే వున్నాడు . అదో ముఖ్య విషయము . , మా వంశంలోను,  కులం లోనూ , గోత్రం లోనూ ఆయన లాగా ఈ  వయసుకు చేరిన వారు లేరు . అందువలన దీర్ఘాయువు  గురించి - ఆరోగ్యాల గురించి చర్చ

వచ్చినపుడు అయన గురించి ప్రముఖంగా చెప్పుకుంటాము . కుల మత ఆచారాల గురించి ఏదన్న సందేహం వచ్చినపుడు  అయన అభిప్రాయమే ముఖ్య మైనది గా అందరూ భావిస్తారు .

ఈయన అనేక జబ్బుల నుండి కోర్టు కేసులనుండీ బయటపడ్డాడు . ఏ జబ్బు చేసినపుడు ఏ హాస్పిటల్ కి వెళ్ళాలి - ఏ కోర్టులో ఏ  కేసు పడ్డప్పుడు ఏ లాయర్ను పట్టుకోవాలి లాంటి విషయాల మీద జనం ఈయన అభిప్రాయాన్నే ముఖ్యంగా భావిస్తారు .  ఇట్లాగ అయన  మా పల్లెలో ప్రముఖుడు .

అయన ఆంగ్లేయ ప్రభుత్వ ఉద్యోగిగా ఉంటున్న రోజుల్లో ఈయన  ప్రాముఖ్యాన్ని గుర్తించిన భారతీయ నాయకులు -కొందరు  ఒక ధర్నా అదీ చేసి మరీ  -ఈయనను  ప్రభుత్వ పని  మీద ఇంగ్లాండ్ కు పంపేటట్లు చేశారు    " మీకు సెప్టెంబర్ ఫస్ట్ కి స్వాతంత్రము ఇస్తాము " అని ఇంగిలీషు వారు అనగా - కాదు ఆగష్టు పది హైదుకు స్వాత్రం ఇవ్వండి ." అని కోరే దాని కోసం అని ఈయన భారత నాయకుల తరఫున  ఇంగ్లాండ్ వెళ్లి , ఇంగిలీషు వారితో పోరాడి  15 -08

-1947 అనే డేట్ కంఫర్మ్ చేయించుకొని వచ్చాడు . అప్పటి పత్రికలు 15 -08 -1947 దేశ స్వాతంత్రం రావటానికి కారణమైన ప్రముఖుల గురించి పేర్కొంటూ అందులో ఈయన పేరు కూడా వేశాయట . ఈ విషయమే "ముఖ్యంగా" అయన మాతో అనేక సంభాషణలు, అనేక చర్చలూ చేస్తూ ఉంట్టాడు .

ఏ జిల్లాకు అయినా కొత్త కలెక్టర్ లేదా , డీ ఎస్పీ. వస్తే {ఇలా జిల్లా లెవెల్ లో కొత్తగా వచ్చిన ప్రతి కొత్త ఆఫీసర్ కు } ఈయన ఒక లేఖ రాస్తాడు . అందులో " ఒక భాద్యత గల పౌరుడిగా, మీ పరిపాలనకు నా వంతు సహకారాన్ని అందించటం కోసం నేను సదా సిద్ధము గా వుంటాను . అగ్నా్య పించండి అబిమతించండి " " ఇట్లు-- పల్లె ప్రముఖుడు " - అని రాస్తాడు . ఇలాంటి లెటర్లు అధికారుల దృష్టిని ఠక్కున ఆకర్షించుతవి కదా ? అందువల్ల వారు -- ఎవరయ్యా ? ఈ "పల్లె ప్రముఖుడు "అని తమ కిందివారిని తప్పక అడుగుతారు " "పల్లె ప్రముఖుడు " ని అని రాసుకునే ఒక పిచ్చి - పుల్లన్న ఆ మూల పల్లెలో వున్నారులెండి " అని సిబ్బంది జవాబు ఇస్తారు . ఇట్లాగా ఈయన తాను ఒక

ముఖ్యునిగా  అందరిదృష్టిలోకి వెడతాడు . పల్లె ప్రముఖుడు అన్న పేరుతో ప్రతి ఆఫీసులో ఒక ఫైలు ఉంటుంది . వాటి నిండా ఈయన రాసిన వందలాది అర్జీలు - పిటీషన్లు ఉంటాయి .

"వూళ్ళో ఉన్న ఓట్లన్నీ- అందులో ముఖ్యం గా  మన  కులం వాళ్ళ ఓట్లు నేను ఎటు చెపితే ఆటే  "అంటూ  రాజకీయ నాయకులను కలిసి వారికి తనను తాను ఒక ప్రముఖునిగా గా పరిచయం చేసుకుంటాడు . కొంత కాలం తరువాత మొక్క యొక్క వేర్లు బాగా  విస్తరించి నేలలో పాతుకు పోతాయి కదా ? అదేవిధంగా  నేను ఒక ప్రముఖుడు ని    అన్న భావన ఆయనలో మొలిచి  -పెరిగి - నరనరానా విస్తరించి మెదడులో పాతుకు పోయింది .

ఒకరోజున నేను అయన వద్దఉన్నాను . ఇంతలో ఎవరో వచ్చి " సార్ పక్కవూళ్ళో  ఉండే మీ ఫ్రెండ్  చని పోయినాడు. వాళ్ళు   మీకు చెప్పమన్నారు " అంటూ  కబురు అందించి వెళ్లి పోయాడు  .

అప్పుడు  ఆయన  నావంకచూసి " అందరికి ఫోను చేసి చెప్పినా గానీ  --నాకు మాత్రం ఫోను చేసి చెప్పే సాహసం చేయరు  . ఎందుకంటే మా వాళ్లలో నేనే ప్రముఖుడు ని .  ఆ గౌరవం కొద్దీ - నాకు మనిషిచేత కబురు పెట్టారు " అన్నాడు .

"సరే మీరు అటు వెళ్లాలేమో  - మరి నేను వెళ్లి వస్తాను " అన్నాను. ఇక్కడనుండి  బయట పడి పోదాము అని.
" ఏమీ ఫరవాలేదు  కూచోండి . మనం చెర్చించుకుంటున్న అమెరికా - రష్యాల మధ్య గల వైరము  గురించి న చేర్చ పూర్తి చేసి- దానిపై  ఒక తీర్మానము రూపొందించి మన రాష్ట్రపతికి పంపుదాము " అన్నాడు  -నేను కూచున్నాక అయన కళ్ళజోడు  సవరించుకొని - చేతి కర్రను ఆకాశం వంక చూపి "మనకు తొందరేమీలేదు ఆ చనిపోయిన వాడికి  నేను ముఖ్య స్నేహితుడిని . వాడికున్న స్నేహితులతో నేనొక్కడినే ప్రముఖుడిని ,  తమాషా   ఏమి జరుగుబోతున్నదో  మీరు తెలుసుకోండి .స్మశానం లో  పాడే పై వున్నా వాని   చితికి నిప్పు అంటిస్తే అది అంటుకోదు . ఎన్నిసార్లు అంటించినా

అంటుకోదు .అప్పుడు మీలాంటి  ఎవరో తెలివి గల వారు "
ఆయనకు కావాల్సిన ముఖ్యులెవరో ఇంకా రానట్లుంది వారిని
పిలిపించండి. అప్పుడే శవ దహనం సజావుగా జరుగుతుంది
. అలాగా ఎన్నో సార్లు జరిగింది . మీకు తెలీదా ?   " అని
సలహా ఇస్తారు .  అతనికి కావాల్సిన ముఖ్యుడిని-
ప్రముఖుడిని  నేనే కదా ?అది వాళ్లకు తెలుసు .  కాబట్టి
ఇంకాసేపట్లో వాళ్ళే వచ్చి,   నన్ను కారెక్కించి తీసుకు
పెడతారు . అందువల్ల మనకు చాలా టైము వుంది . ఈ లోగా
మన  చెర్చ పూర్తి చేద్దాము "అన్నాడు
"ఓం ముఖ్యాయ నమః ఓ  ప్రముఖాయన    నమః " - అని
నేను ఆయనకి నమస్కారం చేసాను .

వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి - సొంత కథ

—-----------------------------------------------------------------------------

**5.**మా అమరావతి అమ్మాయిలంటే **25-04-24**

అది అమరావతి మ్యూజియం లోని ఆఫీసు. లంచ్ హవరుకు
ఇంకా గంట టైము వున్నది అని అనుకుంటూ సీటులోనే

చారిగిలా పడి నిద్రలోకి జారుకుంది సుమిత్ర . --- ఎదో సీరియల్ ప్రభావం వల్లనో ఏమో ఆమె గాభరా గాభరాగా లేచి " అవును నిజమే మా ఆయనకు లంచి బాక్స్ కట్టి ఇస్తున్నాను . కానీ దాని మీద ఆయనేమీ కామెంట్స్ చేయటం లేదు . ఉప్పు తప్పుగా వుందనటంలేదు . తప్పు చప్పగా వుందనటం లేదు . బావుంది అంటం లేదు . నీమొఖంలాగానే ఏడ్చినట్లు వుంది అని టీజ్ కూడా చేయటం లేదు . కూర ముక్కలు వేగలేదు - నీముక్కు బాగో లేదు , అనటం లేదు . ఎందుకబ్బా ?? ఆ సీరియల్ లో చూపించినట్లే మా అయన వంటింట్లో దూరి పని మనిషి కొంగుచ్చుకొని ఏమన్నా ఎమన్నా చిరుతిళ్ళుచేయించుకుని తింటున్నాడా ?ఏంటి ?? అని డౌట్ వచ్చి - తల తిరగగా ఆ పూటకు సెలవు పెట్టి ఇంటికొచ్చేసింది సుమిత్ర .

ఆమె భర్త ఆరముగా కూచొని వున్నాడు . ఎవరో అమ్మాయి కిచెన్ లో నిలబడి టీ పెడుతూ వుంది ,

" ఎవరండీ అదీ ? అని గర్జించింది సుమిత్ర భర్త మీద .

" ఎవరూ ఏమిటి అంటే??? .. ఆ అమ్మాయి డీ మార్ట్ నుండి వచ్చింది . నువ్వు వాళ్ళ దెగ్గర నెలనెలా అవీ ఇవీ అని పదిహేను వేల సరుకు కొంటున్నావు కదా ? నువ్వు వాళ్ళ

దృష్టిలో ట్రూ వేల్యూ కస్టమర్ వట . నువ్వు ఈ నెల సరుకులు ఇంకా ఎందుకు కొనలేదు ? అని ఎంక్వయిరీ చేయటానికి అని ఈ అమ్మాయిని పంపారు ." అమ్మగారికి తీరక ఉండటం లేదు, ఓపిక ఉండటం లేదు, టైం చాలటం లేదు అందుకే కొనటానికి రాలేదు" అని చేప్పాను . అందుమీదట ఆ స్మార్ట్ అమ్మాయి "సరే నండీ నేనే కిచెన్ లోకి వెళ్లి డబ్బాలు అవీ చెక్ చేసి ఏవస్తువులు ఎంత కావాల్సి వస్తవి అనేది లెక్క రాసుకొని అవి పంపిస్తాను. ఇట్ ఈజ్ మై జాబ్ " అని చెప్పి కిచెన్ లోకి దూరింది . నీకు శ్రమ తప్పుతుంది కదా అని నేను చూస్తూ కూచ్చున్నాను . వాళ్లకు ఎదో కొత్త బ్రాండ్ టీ వచ్చిందట . దాన్ని ట్రై చేస్తారా ? అన్నది . చేద్దాము అన్నాను . ఆ పిల్లే పాల ప్యాకెట్, షుగర్ తెచ్చి టీ పెడుతోంది . నీకు నయా పైసా ఖర్చు లేదు . కొత్త టీ ట్రై చేయ దలుచుకుంటే వోయి మూడు కప్పులు చెప్పు . నువ్వూ మాతో పాటు తాగొచ్చు " అన్నాడు .{ఇదం మొదటి ముక్క}

మరునాడో ఆ మూడో నాడో - సుమిత్ర భర్త గారు ఇంటికొచ్చాడు . బెడ్రూం లోని సోఫాలో ఒక యువకుడు ఆరాంగా కూచొని వున్నాడు . ఎవరు వీడు వీడి కిక్కడేమి పని అని అయ్యగారు సుచిత్ర మీద శివ తాండవం ఆడాడు.

"చెపుతానండీ.. అన్నీ చెపుతాను. మీరు దెగ్గర దాస్తానా ? ఆలా శివతాండవాలు ఆడి అలిసి పోవద్దు. మీరు ఖరీదైన రొండు టీవీలు మూడు ఏసీలు ఓ వాషింగ్ మెషీను మనకోసం కొన్నారుగా ? అవి అమ్మిన షో రూము వారు లక్కీ డ్రా తీసి మిమ్మల్ని తమ ట్రూ వాల్యూ కస్టమర్ గా సెలెక్ట్ చేసుకున్నారట . ఆ షో రూము వారు తమ ట్రూ వాల్యూ కస్టమర్ కి 24 గంటలూ ఇంటూ 365 డేస్ ఫ్రీ {FREE}రిపేర్ & ప్రీ {PRE } రిపేర్ ప్రివెంటివ్ సర్వీస్లు బహుమానంగా ఇచ్చారుట . ఈ కుర్రాడు ఆ పనిమీద వచ్చాడు . వచ్చి నప్పటి నుండీ మన ఏసీ చక్కగా పనిచేస్తూ వున్నదో లేదో, గ్రైండర్ తిరుగుతూ వున్నదో లేదో , టీవీ పలుకుతూ వున్నదో లేదో , గీజర్లో వేణ్ణీలు వస్తన్నవో లేవో అని ఓకంటితో ట కనిపెడుతూ తన డ్యూటీ తాను చేసుకుంటున్నాడు . ఇందాక . కరెంటు పోయినపుడు - కరెంటు పోయిందా లేక ఫీజు పోయిందా అనేదికూడా కూలంకషంగా చెక్ చేసాడు . మన బెడ్ రూమ్ స్విచ్ బోర్డులో ఎదో షార్ట్ సర్క్యూట్ ఉందని - దాని వల్ల నే మనకు కరెంటు పోవటం రావటం అని కనిపెట్టి, ఆ షార్ట్ సర్క్యూట్ వాళ్ళ మన ఏసీ దెబ్బతిన వచ్చని అలోచించి, ప్రీ రిపేర్ ప్రివెంటివ్ సర్వీసు చేస్తూ - అన్నింటినీ అబ్సర్వ్ చేస్తూ

ఇక్కడ కూచున్నాడు . అంతే " మీకిక ఓం శాంతి శాంతి శాంతి అయ్యిందా ? అన్నది సుమిత్ర .

మా అమరావతి అమ్మాయిలంటే ఇలానే వుంటారు .
గోదారోళ్ళు వీళ్ళకు చెల్లెళ్లు కావాల్సిందే -----

.

---అందరూ నూ , నాకు అక్కలు చెల్లెస్ద్రే అనుకోని, వారికోసమని, వారిచేత మా మొగవారికి టిట్ ఫర్ టాట్ కొట్టించాలని రొండో ముక్క రాసాను . రాసినందుకు మొగవారికి నా అప్పలాలాజీలు . అసలైతే మొదటి ముక్కతోనే ముగించేసి , ఆడవాళ్ళ నోర్లు ఏలామూయించాలో అనేది మా మొగోల్లకి చెప్పి వారి మెప్పు పొంది ఈ రాత్రికి వారితో కలిసిఓ ఫ్రీ బీ కొడదామని నేను వేసుకున్న నా ప్లాను. ఇంట్లోకి ఎవరినో తెచ్చుకొని . అనుకున్నది అనుకున్నట్లు చేయలేక పోతూ వున్నా మొగ వారికి నా వందనాలు

వారణాసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి స్వంత రచన

---

*6.టెంప్టింగ్ జాబ్* ***24-04-24***

గిరిబాబు జాబు కోసం వెళ్ళాడు . వాళ్ళు పేపర్లో "టెంప్టింగ్ జాబ్స్ వున్నవి" అని యాడ్ వేసాబు.  అది చూసి మనవాడు వెళ్ళాడు  .
వుద్యోగం ఇచ్చే సీటులో కూచున్న ఆయన గిరి బాబును చూసి "నీ చదువుతో నాకు పనిలేదు . మంచి ఫిజిక్ వుంది . కాస్త అందంగానే వున్నావు . ఆరోగ్యంగా కూడా వున్నావు . అందుకని నేరుగా --  నువ్వు చేయాల్సిన పని చెపుతాను విను . మా కంపెనీ ఒక పెద్ద బస్సు ష్టాండు లో వుండే   ఫాస్ట్ ఫుడ్ /టిఫిన్స్ /భోజనం / కూల్ డ్రింక్స్ / ఐస్ క్రీమ్ స్టాల్స్ - కాంప్లెక్స్ ను వేలంలో దక్కించుకున్నది . ఐటెం  ధరలుఎక్కువగా పెట్టాము అని కాబోలు ఎవరూ ఎగపడి కొనటంలేదు.  మేము  నీకు ఒక కూల్ డ్రింక్ /మజా/ ఐస్ క్రీమ్ / చిప్స్ పాకెట్/ స్వీట్ /చాకోలెట్  ఇలా ఏదో ఒకటి ఇస్తాము అనుకో . నీవు అవి తింటూ-   అవి ఎంతో కమ్మగా వున్నవి అన్న ఫీలింగ్ ఎదుటివారికి కలగ చేస్తూ ఎదుట వారిని ఊరిస్తూ బస్సు స్టాండ్ అంతా కలయ తిరగాలి . జనం గుమికూడి వున్నావున్న   చోట  ఓ సూట్ కేసు మీద కూర్చొని వాటిని తింటూ,- ప్రతి వారు కూడా అవి కొనుక్కు తీసేట్లు టెంప్ట్ చేయాలి అనగా వారి నోట్లో లాలాజలపు గంగ వూరేటట్లు చూడాలి .  నిన్ను చూడగానే

నువ్వు లైఫును ఎంజాయ్ చేస్తున్న నవ యవకుడి వని ,
నీలా తింటూ త్రాగుతూ కాలం గడపకుక పోతే జీవించటం
వ్యర్థం అనే ఫీలింగ్ ముసలి వారిలో కూడా  కలగాలి . నీవు
అలాంటి యాక్షన్తో  ప్రవర్తిస్తూ -నీ లాంటి  యువకుల్ని -
యువతులను  చిన్నపిల్లలని , బడి పిల్లలను ,
ఆడపిల్లలను  ఐస్ క్రీములు-కూల్  డ్రింకులు
కొనుక్కునేట్లు టెంప్ట్ చేయాలి. నీవు కావాలంటే నీ
స్నేహితురాలిలాగా ప్రవర్తిస్తూ నీతో తిరిగేందుకు హీరోఇన్
లాంటి ఒక యువతిని కూడా ఇస్తాము . మీ ఇద్దరూ కలిసి-
దివ్య ప్రేమికులలాగా ఒకరి ఐస్ క్రీములు ఒకరు నాక్కూ
తింటూ  డ్రింకులు తాగుతూ కాలేజీ యువతను టెంప్ట్
చేయండి .ఎందుకంటే కాలేజీలకు వెళ్లివెళ్తూ వస్తూ. ఏమీ
తినకుండా   బస్టాండింగ్ లో కూచునేది వాళ్ళే . ఇలాగొ ,
ఇంకోలాగో .    నువ్వు ఎమన్నా చేయి . నిన్ను చూసిన
వాళ్ళు టెంప్ట్ అయి నీ చేతిలో వున్నా ప్రోడక్ట్ కోసం మన
స్టాల్ లోకి రావాలి. నువ్వు   టీవీ యాడ్ లోని సినిమా
హీరోలా యాక్షన్ చేసి విజయం సాధించాలి. మా  బిజినెస్
పెరగాలి. మాది చాలా ఇన్నో వేటివ్  ఐడియా. ఇంకా
చెప్పాలంటే ప్రపంచం లోనే మొదటిది కూడానేమో  .  దీని
సక్సెస్ ఈ జాబు చేసే వారి చేతిలో వుంది .ఏమంటావు ?
సై అంటావా ?అని అడిగాడు ఆ జాబులిచ్చే అయన

" మీ జాబు చాలా టెంప్టింగ్ గా వుంది . చిరంజీవిలా ,
నాగార్జునలా ,  మహేష్ లాగా -  నో  యాక్టింగ్ చేయటానికి
స్కోపు కూడా చాలా వుంది . హీరో తో పాటు హీరో ఫ్రెండ్స్
ఎవరన్నా వుంటారా ? ఉంటే నేను జనాన్ని ఎంతో టెంప్టింగ్
చేస్తాను . మీరు నాకు  టెంప్టింగ్ జీతం ఇస్తే - వెంటనే -
ఇప్పుడే జాబులో చేరతాను. నన్ను చూసి నాకు ఎవరన్నా
హీరో వేషం ఆఫర్ చేస్తే - నేను అటు పోతాను . మీరు
కాదనకూడదు . అది నా కండిషన్  " అన్నాడు గిరిబాబు .

గిరిబాబు కండీషన్కి మెచ్చి అతనికి ఆ జాబు ఇచ్చేసారు .
అదీ సంగతి .

ఆ ఒరిజినల్ బై వారణాసి శ్రీ రామ కృష్ణ  అఫ్ అమరావతి

—-------------------------

***7.*పీ పుల్లయ్య అనే పేరు కు*....  23-4-24***

" పీ పుల్లయ " ఎంతో తపస్సు చేసాడు .

గతాన్ని పట్టి  చూస్తే - భక్తుడు అడిగే దాకా - అతడు
ఏమి కోరుతాడో అనేది భగవంతునికి కూడా తెలియదు .
మనసులో మాట అంత నిఘాఢంగా ఉంటుంది మరి .
త్రిశంకుడు ఎదో ఒకటి చేసి తన పేరు  శాశ్వతంగా

స్మరించ బడేట ట్లుగా చేసుకున్నాడు కదా ? అలాగే తాను కూడా ఏదన్నా ఒకటి చేసి తన పేరు శాశ్వతంగా స్మరించ బడేట ట్లుగా చూసుకోవాల న్నది మన - పీ పుల్లయ్య " కోరిక . భగవంతుడు వచ్చి " ఏమి నీకోరిక ? " అని అడిగాడు .

" హే భగవాన్ .. నిన్ను చూడగానే అందరూ స్తోత్రాలు పాడినట్లు చూసాము . ఈ స్తోత్రం అనేది అప్పటి కప్పుడు ఆశువుగా తన్నుకు వస్తుందా ? లేక ఆ పాటికే నేర్చుకున్నది బయటకి తన్నుకు వస్తుందా ? సందేహం తీరగలవు ?"

" మీ స్త్రీ లకు కడుపు పండినపుడు వాంతులు తన్నుకొచ్చినట్లు - మీ పూజ పండినపుడు స్తోత్రం తన్నుకొస్తుంది నాయనా "

" ఇలాంటి కుక్క మూతి పిందెలవంటి సందేహాలు వెలిబుచ్చటం వల్ల కూడా పేరు చేసుకోవచ్చు కదా ? అందువల్ల మన పుల్లయ్య అలా అడిగాడు.

నేటి టీవీ లలో వచ్చే సందేహాలు సమాధానాలలో కొన్ని కుక్కమూతి పిందెల వంటి ప్రశ్నలు చూస్తూ ఉంటాము . దీనికి మన పుల్లయ్యనే ఆద్యుడు ."

అలాంటి ప్రశ్నలని - పీ పుల్లయ్య ప్రశ్నలు అని పిలిచి మనము  అతని పేరుకు శాశ్వతత్వము కల్పించాలి అని నా విన్నపము .

" సరేగానీ - కావల్సింది కోరుకో నాయనా "

" హే భగవాన్ .. పాలు తాగని పిల్లిని సృష్టి చేసి ఇవ్వు "

" ఎందుకు ఈ వింత కోరిక ?"

" అ పిల్లి ని - "ఫుల్లయ్య  పిల్లి" అనే పేరున లోకయానికి పరిచయం చేసి,   నా  పేరు ఈ ప్రపంచంలో శాశ్వతంగా  - అనగా  త్రిశంకుడు పేరు నిలిచిన మాదిరిగా నిలిచి పోయేట్లు చేసుకుంటాను . నువ్వెన్ని మణి  మాణిక్యాలు ఇచ్చినా నా పేరుకు ఆ శాశ్వతత్వము రాదు . అందుకని  ఇట్లా అడిగాను  . కాదనకు "

" సరేను - మెచ్చాను .ఇచ్చాను.  ఇంకో వరం కోరుకో "

దేముడు వరాలు ఇవ్వటం మొదలెడితే మూడు ఇచ్చి కానీ వదలడు అని ప్రఫుల్లయ్య కు తెలుసు .

" నాకు చావు లేని వరము ఇమ్మంటే దేముడు ఇవ్వడు . ఇచ్చినా గానీ ఎక్కడో ఏదో తిరకాసు పెడతాడు" . అని

ఆలోచించి న పుల్లయ్య తెలివిగా - " నా రక్తము
అమృతం కావలి . " అని అడిగాడు . ఈ సృష్టిలో
అమృతమే నెత్తురుగా కల మనిషిగా తన పేరు
శాశ్వతంగా నిలిచి పోతుందని పుల్లయ్య మొదటి
ఉద్దేశ్యము . "రక్తము అమృతము అయితే చిరకాలం
బ్రతక వచ్చు . కోటీశ్వరులకు బ్లెడ్ డొనేట్ చేసి లక్షలు,
కోట్లు సంపాదించు కుంటూ ఉండవచ్చు . సొంత బ్లెడ్
అమ్ముకొని కోట్లు సంపాదించిన వ్యక్తిగా కూడా తన పేరు
శాశ్వతంగా నిలిచి పోతుంది కదా ? " అనేది పుల్లయ్య
రెండో ఉద్దేశ్యము .

"రక్తం అమృతంగా అవుతూ వున్నది. చివరిగా ఇంకో
కోరిక కోరుకో "

" నేను నిలుచున్నా ఈ రాతికి ఎగిరే శక్తీ ఇవ్వు "

"ఇచ్చాను పో" అన్నాడు దేముడు .

మన" పీ .పుల్లయ్య" అప్పటి వరకూ ఒక బండ మీద
నుంచొని ఈ కోరికలన్నీ కోరాడు .కాబట్టి ఆ బండ రాయి
ఏ ఎగరాలి కదా ?. కానీ ఆ బండ నిజానికి ఒక మెట్ట
తాబేలు . దారి తప్పి కొండమీదికి వచ్చింది .మన
పుల్లయ్య అదొక బండ రాయి అనుకుని దానిమీద
ఆసీనము అయి తపస్సు చేసాడు . ఎట్లాగో ఇంటికి

పోలేకుండా వున్నాను, నేను కూడా తపము
ఆచరిస్తాను అనుకోని తాబేలు కూడా తపము
ఆచరించింది . ఒకే దెబ్బకు రెండు పిట్టలు అనే టెక్నిక్
ఫాలో అయిన దేముని లీల ప్రకారం మన పుల్లయ్య ఏ
ఆ తాబేలు తరఫున కోరిక కోరాడు కానీ, బండను
ఎగిరించిన మనిషిగా తన పేరు శాశ్వతం చేసుకునే
టందుకు మాత్రం కాదు .

ఇప్పుడు తాబేలు , తాబేలు మీద వున్న పుల్లయ్య
గాలిలోకి లేచి పెళ్లి పోసాగారు . ఆలా పెడుతుండగా
పుల్లయ్య కోసం దేముడు సృష్టి చేసిన పిల్లి అతని
చేతుల్లోకి వచ్చింది . అది పుల్లయ్యని గోళ్ళతో రక్కింది .
పుల్లయ్య కెవ్వున కేకవేసి - తాబేలు వీపు మీదనే
గంతులు వేసి, పట్టు తప్పి జారి కిందకు పడి పోయాడు
.

పుల్లయ్య తపస్సు చేస్తున్నన్ని నాళ్లూ కొన్ని దోమలు
అతని రక్తము పీలుస్తూ వున్నవి . అవి పుల్లయ్య
రక్తము అమృతము కాబోతున్నది అని తెలుసుకుని
" మీరు బంధుమిత్ర సపరివారంగా రావాలె " అని

మిగతా  దోమలకి కబుర్లు అంపినవి .  అవి అన్నీ కలిసి కోటి వరకూ వచ్చినవి .

అవి కిందపడుతున్న పుల్లయ్యను చుట్టూ ముట్టి , చప్పు చప్పున అతని రక్తము తాగి , సెకండ్ల వ్యవధిలో అతనిని చర్మపు మూట లో వున్న ఎముకల పోగులా మార్చి కిందకు వదిలినవి .అతడు పోయి ఒక నదిలో పడ్డాడు .నీటిలో పడి మృతి చెందాడు . ఆ మృత దేహాన్ని కొన్ని చేపలు కొరికి తిన్నవి . అందువలనే ఎవరూ పెంచకపోయినా గానీ నదులలో ను సముద్రము లోనూ కుప్పలు తెప్పలుగా చేపలు పుడుతూ ఉంటవి. వాటి జాతికి అంతము  లేదు . అవితింటున్నందువలనే మానవ జాతికి కూడా అంతము  లేదు . దీనికి కూడా మనము ఈ పీ .పుల్లయ్యనే స్మరించు కోవాలి . అతనికి దక్కాల్సిన కీర్తి అతని కి దక్కాలి .

ఒక ఆమనిషి యొక్క అస్తి పంజరం ,   ఒక పిల్లి యొక్క ఆస్థి పంజరాన్ని  చేతుల్లో బిగించి పట్టు కొని ఈజిప్టు చరిత్రను పరిశోధించిచే  వారికి సింధు లోయలో దొరికింది , ఇది ఏమి దేముడు?  లేదా దేవతాః?   అని వారు ఆలోచనలలో పడ్డారు .

దోమలు ఇంత అమరము గా ఎందుకున్నావా? అని ప్రపంచ శాస్త్ర వేత్తలు ఎందరో ఆలోచనలో పడ్డారు, .అది పుల్లయ్య చేసిన తపః ఫలమే అని వారికి తెలియదు . ఎవరు చెపుతారు ?

ఎందరో ఆలోచనలో పడ్డారు అని విన్నాక కూడా నేను ఇదీ సంగతి -అని చెప్పక పోతే నాదీ తప్పు అనుకుని , పుల్లయ్యకు రావాల్సిన కీర్తి పుల్లయ్యకు రాదు కదా అని అలోచించి -- మీతో అసలు విషయం చెప్పేసాను . మీరు టీవీ లో , పేపర్లో చూస్తూ వుండండి . పూరి గుడిసెలోనుండి పొగ వచ్చినట్లుగా , పుల్లయ్యకు నెమ్మదిగా కీర్తి వస్తూ వున్నది .

పీ పుల్లయ్య అనే పేరు కు శాశ్వత కీర్తి కల్పించుటకు మీ వారణాసి శ్రీ రామకృష్ణ చే ఈ కథ కల్పించి రాయపడినది .

——-----------------------------------------------

-----

***8.*** భయాలన్నీ తొలగిన వేళ ***22-4-24***

"ఇంకానూ తాత్సారం చేయను వీలు లేదు.  పిల్లకి  పెళ్లి చేసేయాలి - మనం పెద్దవాళ్ళము అవుతున్నాము . ఉన్న కాస్త ఓపికా   పోయే లోగా  మనం ఎవరినన్నా తెచ్చుకొని  మన ఓపికకు ఊతం ఇప్పించుకోక  తప్పదు " "అన్న భయంతో,  వారు    తమ అమ్మాయికి పెళ్లి తల పెట్టారు .తల్లి తండ్రీ భయాలు చూసి   అమ్మాయి మణి గారికి కూడా కొన్ని భయాలువచ్చాయి . మీరు ఊహించినట్లే " ఆ అబ్బాయి మా అమ్మ నాన్నని సరిగా చూస్తాడో లేదో " అన్న భయం తోటే  ఆ పిల్ల పెళ్లి  పీటల మీదకు వచ్చింది .   .

పిల్ల తల్లి భయము లు అనేకము వున్నవి అందులో కొన్ని ఇట్లా వున్నవి -  " మేకుకు మల్లె  కుర్చీలో కూచొని,  ఎప్పుడూ ఫోను గీకుతూ వుండే మన అమ్మాయిని , ఆ  వచ్చే అల్లుడు  ఫోను వాడనిస్తాడో లేదో ? ఇంటికి ఇల్లాలే దేవత అంటూ మా  అమ్మాయి చేత వాకిలి ఊడ్పించి ముగ్గులు పెట్టిస్తాడేమో ? రోజుకో రకంగా కూరలు చేయమంటాడో ఏమో? తోటకూర కడిగి--  తరిగి ఇస్తాడో లేక తరిగి నాకా కడుగుతాడో

?తోటకూర మూలకంగా  విటమిను ను లోపం వస్తే మన పిల్ల ఏమికాను ?   మన పిల్ల  అత్తగారు ఎక్కువకాలం బ్రతికె ఉంటుందో ఏమో ? పిల్లకు రక్తము అంటే పడదు . వచ్చే అల్లుడు  - సాఫ్ట్ వేర్ వుద్యోగం  చేసే డాక్టర్ కావాలనుకుంటున్నాము .   అట్లాటి వారు వుంటారో లేదో  ? వియ్యాలవారికి    బంగారు బంగ్లాలు . కార్లు కార్ల ఫ్యాక్టరీలు వంటివి వుంటాయో  లేదో ?  ఉంటే వాటి మీద బ్యాంకు లోన్లు ఉన్నాయో ఏమో ?ఎట్లా తెలుసుకోవటం . ఆడిటర్ని పెట్టుకుంటే సరి పోతుందా ?

అనేక సీరియల్స్ చూసి కొన్నీ  - ఊహించి కొన్ని  - పిల్ల మీద ప్రేమతో కొన్నీ,  - తన కూతురి వివాహ జీవితం గురించి ఆ తల్లి  అనేక భయాలు కల్గించుకున్నది  . ఆలోచించిన కొద్దీ - ప్రపంచము లో ఉన్న వైభోగము లు తన కూతురుకు అందుతాయా?   లేదా?   అనే భయాలు కూడా తల్లిలో కలిగినవి . ఇలాంటి భయం వల్లనే పిల్ల పెళ్లి ఇప్పటి వరకూ ఆగింది .
ఇహ పిల్ల తండ్రి  భయములు --"నాకొడుకులు నన్ను చూసుకోక పోతే నాకెవరు దిక్కు ?  ఆ వచ్చే అల్లుడు నన్ను కన్న తండ్రిలా చూసుకుంటాడా లేదా ? వాళ్ళ

నాన్ననే చూసుకుంటాడేమో ? ఏడూ వారాలకు ఏడు దేవతలు అనేవాడా ? లేక దేముడొక్కడే అనేవాడా ? అసలేమీ లేవనే వాడా ? వాళ్ళ నాన్నని , తాతని హాస్పిటల్కి తిప్పిన అనుభవం వున్నదో లేదో ? ఇప్పుడు వాళ్ళమీద ఇతనికి విరక్తి వచ్చిందో లేదో ? కబురేస్తే కారు తీసుకొని వచ్చి వాకిట్లో నుంచుంటాడో లేదో ? నా భయాలు అన్నీ పోగొట్టే వాడికే నా పిల్లను ఇస్తాను . " "

పిల్ల భయములు - పిల్లలు కనాలి అంటారేమో ..ప్రెగ్నెన్సీ రాగానే ఆ డాక్టార్లు నాకు బెడ్ రెస్ట్ రాస్తారో రాయారో ? పిల్లల డైపర్లు ఆయన చేంజ్ చేస్తాడో చేయడో ? పిల్లలని అయన నిద్రపుచ్చుతాడో లేదో ?వాళ్ళ అమ్మనాన్నలు అంటే ప్రేమ కొద్దీ వాళ్ళు చెప్పిన పేర్లే పెడతాడో ఏమో ? పిల్లలు పుట్టకుండా ఎంతకాలం వీలైతే అంత కాలం గడపటానికి వీలు కల్పిస్తాడా లేదా ?

పిల్లాడి తల్లి భయము లు - ఆ వచ్చేది మావాడిచేతనే వండిపించుకొని తింటుందేమో?నా పిల్లవాడు

అమాయకుడు . అది వాడిని ఏమి ఆటలు ఆడిస్తుందో ఏమో ? పొద్దున్నే కాఫీ ఇసుందో ఇవ్వదో ? టీనే తాగిస్తుందేమో ?

పిల్లాడి తండ్రి భయములు - ఆ కోడలు పిల్ల వచ్చి - "కాదు.. కాదు నావల్ల కాదు అంటూ మమ్మల్ని బయటికి నెట్టేస్తుందేమో ? నేను సంపాదించిన నాలుగు కోట్ల ఆస్తిని చూసి అయినా, ఆపిల్ల అత్తా మామల భాద్యత తీసుకుంటుందని ఆశపడుతున్నాము ? ఆశ నిరాశ అవుతుందా ? క మీటోడి ఆస్తి నాకెందుకు ? ఎదో వందకోట్లు సంపాదించినట్లు మాట్లాడుతున్నాబు . అంటూ నన్నునా కోడలు నన్ను ఛీత్కరిస్తుందా ? నా బతుకు ఏమవుతుంది ?నేను ఎక్కడ చనిపోతానో ?హాస్పిటల్ లోన అనాధాశ్రమం లోనా ? అవని గడ్డలోనా ?

పెళ్లి పిల్లాడి భయాలు -- పెళ్లి అయినా క కాపురానికి వస్తుందో లేదో ? రావటానికి ఏమి కండిషన్స్ పెడుతుందో ? వండుతుందో పార్సెల్ తెమ్మంటుందో ? పిజ్జా నా నూడిల్సా ? ఏమి పార్సులో ఏమిటో ?

కొందరు పెళ్లి కూతుళ్లు - ఆ తరువాత భర్త
ఒప్పుకుంటాడో లేదా పెళ్ళికి ముందే పిల్లల పుట్టకుండా
ఆపరేషన్ చేయించుకుంటున్నారని న్యూస్ వస్తోంది.
నాకు వచ్చేది పిల్లలు వాలనుకున్నదో ? వద్దనుకుని
ఈ పాటికే ఆపరేషన్ చేయించుకుందేమో ? నేను కోటి
పెట్టి ఫ్లాట్ కొన్నాను . అది చాలదు నాకు వేరేగా ఇంకోటి
కావలి పిల్లలకోసం అని వాళ్ళ కూల్డ గ్గరలో ఇంకో
ఇండివిడ్యు వల్ ఇల్లు కావలి అంటుందేమో? నేను తన
భర్తని అని చెప్పుకుంటుందో - లేక నా ఫ్రెండ్ అంటుందో
? తన ఈ యం ఐ లు కూడా నేనే కట్టాలంటుందేమో ?
ఆరోగ్యంగా ఉంటుందా ? లేక నడుము నొప్పి పిల్లా ?
తన స్నానాకి నీళ్లు నేనే పెట్టాలని , పెట్టక పోతే
విడాకులు అనే సున్నితంపు పిల్లా ?

పైన చెప్పిన ఆరుగురు మనుషులు ఆరు రకాలుగా
భయపడుతూ వున్నారు .

పై వారికి బ్రహ్మ లిఖితం గా పెళ్లి అయ్యింది .

ఈ కొత్త జంట - భయం భయంగానే,  అంటే భర్త నాకేమి పనులు అంట కడతాడో అని అమ్మాయి ..  ఈ పిల్ల నా ఈ మొగ పుట్టుకను తీసి పారేస్తూ నాకు  ఏమి పనులు పురమాయిస్తుందో అనుకుంటూ పిల్లగాడు - ఒక మొక్కు తీర్చుకోవటానికి అని కొండకు వెళ్లారు . వాళ్ళు తిరిగి తిరిగి వస్తూ వస్తూ ఉండగా, వారి   కారుకు ఒక యాక్సిడెంట్ అయి స్వర్గానికి కూడా వెళ్లారు .

పార్వతీ దేవి ఇది ఆంతా చూస్తూనే వుంది . యమునికి కబురంపి తన సమక్షానికి రమ్మని ఉత్తరువు వేసింది ."ఏమిటా దుశ్చర్య ? ఆ పిల్ల గౌరీ పూజ చేసి నది . ఇంకా కాళ్ళ పారాణి కూడా రాలేదు . అలంటి  ఆ దంపతులను పైలోకాలకు ఎందుకు తెప్పించావు ? అని కళ్ళు ఎర్ర చేసింది .

యముడు గడా గడా వణుకుతూ " అమ్మా ఇది శివుని ఆజ్ఞ .ఆ ఆరుగురి భయాలను ను చూసి మాకే భయం వేసింది . వారి భయాన్ని - మా భయాన్ని   నివారించి అందరికి అభయం ఇవ్వాలంటే ఇంతకన్నా వేరు మార్గం

లేదు అని మహేస్వరుల వారు అన్నారు .దాని ప్రకారం నేను చేసాను " అన్నాడు

"ఏమి నాధా ఇది నిజమా ? అని మాతా పార్వతి నివ్వెర పడింది .

" దుఃఖము అంటే వానలా వచ్చి వెళ్లి పోయేది . భయము అన్నది ఆకాశము లోని మబ్బుల్లా పెరుగుతూ పోయేది , భయానికి మరణమే అభయము అని సృష్టి నియమము . వీళ్ళను- వీరు భయాలను చూసి ఎంతో అలోచించి ఏమీ చేయ వలెనో తెల్చుకొనలేక - ఇట్లా అభయ ప్రదానము చేసాను " అని మా అమరావతి శివుడు న్నాడు .

శివుని ఆజ్ఞ లేక చీమ అయినా కదలదు - అన్నది గుర్తించ లేక , అంతా తమ చేతిలోనే వుండాలంటూ - పెళ్లి దాని పర్యవసానాల మీద పరమ వీర భయంకరంగా అలోచించి - అలోచించీ, శోధించి శోధించి ఆ ఆలోచనలతో నే పిల్లల పెళ్లిళ్లు వేసే వారి కోసం అని

మాశివుడు కొంచెం కొత్త దారి తొక్కారు " అనుకుంటూ మాతా పార్వతి మౌనం వహించింది .
'మేమున్నాము కాదేంటండీ' -- అన్నారు ఒకాయన
వారణాసి శ్రీరామా కృష్ణ అమరావతి
—-----------------------------------------------------

9.తల్లీ -తండ్రి -బిడ్డ ల ప్రయాణం 22-04-24

తల్లీ తండ్రీ బిడ్డతో ఇలా అన్నారు . నీ పుట్టుకా మా పుట్టుకా ఒకేలా మొదలయ్యింది . అందరమూ పాలుతాగుతూనే పెద్ద అయినాము . అప్పట్లో నా ఆటలు నా చదువులు, ఇప్పట్లో నీ ఆటలు నీ చదువులు వేరు . బ్రతకాలని , బ్రతుకు తెరువు కోసం ఓ వుద్యోగం లేదా ఓ వ్యాపారం చేయాలని , పెళ్లి చేసుకుని నాది అనే కుటుంబము నిర్మించుకోవాలి, అన్న విషయంలో మన అభిప్రాయాలు కలిసాయి. ఆతరువాతి నుండి ఎవరి దారిన వెళ్ళాము వెడుతున్నాము . ఇప్పుడు నా తాపత్రయాలు , నా ప్రయాణం రేవు చేరనున్నాయి . ఎంతో అలాస్యంగా నైనా నువ్వు మమ్మల్ని అనుసరించి వస్తావు

అనటంలో తప్పులేదు . ఈ విషయంలో నాతో ఏకీభవించక తప్పదు .మనము చివరి క్షణములో ఏకీభవించుకోవటం కన్నా ముందు , మధ్య మధ్యలో ఏకీభ వించుకుంటూ ఉంటే నే మనము తల్లీ -తండ్రి బిడ్డలము .

—------------------------------------------

-- మానాయన గారి మాటల్లో " మోక్షము " --

ఓరోజు వారు ఇట్లా అన్నారు . మోక్షము మోక్షము అని అనుచూ ఉందురు . అదేమిటీ ? అన్నది ఎవరైనా చూచితిరా ? చూడలేని దానిగురించి అనుకున్నవి
అన్నీ ఊహలే అగును . అట్లా మోక్షము కూడా ఒకవూహ . ఈ మోక్షము వెనుక వున్నా వూహ ఏమిటి ? .

ప్రతి మానవుడూ తన మరు జన్మమున తిరిగి మనిషిగానే పుట్ట వలెనని కోరు చుండును . ఎక్కడ పుట్టవలెనని కోరుచుండును ?ఎట్లా పుట్టవలెను ? ఎంత బాగా పుట్టవలేను ? అన్న విషయమై

అతనికి అనేక కోర్కెలు కలిగి - అతని మనసులో అశాంతి రగులును . అప్పటి నుండి ఏమేమో చేయుచుండును .

మోక్షము కొరకు అనేకఆలయములు తిరుగును . ఆలా తిరుగునపుడు వారు , ఆ దేశము, ఆ ప్రాంతముల , జనులు - అక్కడ ఉన్న చలి వేడి , నీరు , నేల , నింగి , ఆధారముగా ఎట్లెట్లు బ్రతుకు తుండిరో గ్రహింపవలేను . అన్ని రకముల పరిస్థితులలో నూబ్రతుకుటకు , జీవించి సుఖములు పొందుటకు దేముడు అనేక వీళ్ళు , కలిగించి నాదని నీవు తెలుసుకుందువు . ఇలా తెలుసుకున్న పిదప "నేను ఎక్కడ పుట్టినను- ఏమై పుట్టినను ఎట్లా పుట్టినను అక్కడ కూడా భగవంతుడు నాకొరకు ఎదో అలోచించి ఏ ఉండును అనెడి తెలివి తెచ్చుకొందువు". ఈ తెలివి తెచ్చుకుంటాయే మోక్షము సాధించుట . ఇది సాధించిన పిదప ఆత్మ దుఃఖమును జయించును . ఈ జయమే మోక్షము .ఒక్క మాటలో చెప్ప వలెనన్న ఆత్మలోనుండి ఆలోచన నుండి

మరుజన్మల ఆలోచనలను  దూరము చేయుటయే మోక్షము .

——-------------------------------------------------

-

*10.* ఇవాళ్టి సూక్తి *-     09-02-24*

ఏ స్త్రీ అయినా తన భర్త ప్రేమకు  చెల్లించవలసిన బదులు ఏమిటంటే? - అన్ని వేళలా నేను నీకు  కు నేను తోడుంటాను అన్న మౌన ప్రకటన చేయటమే , ఆ విశ్వాసం భర్త లో  కలిగించటమే. .ప్రేమ  అందం కొద్దీ దొరికేది కాదు  . ఎవరినుండి అయినా సరే ,   ప్రేమ ఒక హక్కు  కాదు .  అది మౌన ప్రకటనలతో ప్రకటనతో సాధించుకోవలసినది .

వారణాసి శ్రీ రామకృష్ణ అభిప్రాయాలు మాత్రమే

——----------------------------------------

**11.** దప్పిక వేసిన దయ్యాలు      **20-04-24**

ఒక ఆడ -- ఒక మొగా దయ్యము లు  తాము నివాసం ఉంటున్న దిగుడు భావి లోనుండి బయటికి వచ్చి పట్నం దిక్కు పట్టాయి . మండుతున్న ఎండలోని వడగాలిలో

తేలుతూ అవి జొన్న చేల మీదుగా రోడ్డు మీదకు చేరుకున్నాయి . అటుగా వస్తున్న ఆర్ టీ సి బస్సు ఎక్కి పట్నం చేరుకోవాలని వాటి ఆలోచన . బస్సు ఖాళీగా నే వున్నది . ఇద్దరూ వెల్లి సీట్లో కూచున్నారు . కండక్టర్కి ఒక  టికెట్ కై ,  డబ్బులు ఇచ్చి ఒకరి ఒళ్ళో ఒకరు కూచున్నాయి . అనగా రొండిటిలో ఒకదయ్యము మాత్రమే మామూలు  కంటికి కనపడుతూ వున్నది  అని అర్ధము  .

ఈ దయ్యాలకు వాటికి  ఉండవలసిన పూర్తి పవర్స్ లేవు .  అవి వెళ్లి.  దయ్యాల  సంఘంలో అడిగితే " మీ డేట్ అఫ్ డెత్ సర్టిఫికెట్లు తెండి .మీరు నిజముగా చని పోయారని నిర్ధారణ అయితే మీకు కు ఇవ్వాల్సిన పవర్స్ మీకు   ఇస్తాము" అని  సంఘము వారు చెప్పారు .   ఆ తరువాత వారే " సరే మీకు ఎమర్జెన్సీ లో పనికొస్తుంది అని కేవలం 24  గంటల పాటు పనికొచ్చే కొన్ని టెంపరరీ పవర్స్ ఇస్తున్నాము  తీసుకోండి" అనికొన్ని  టెంపరరీ పవర్స్ కూడా ఇచ్చారు . దయ్యాలు ఆ పవర్స్ ని పుచ్చుకొని  బయలు దేరాయి . అందువల్ల ఇవి కొన్ని దయ్యపు పనులు చేయగలుగు తాయి . కొన్ని పనులు చేయలేవు .

మిట్టమధ్యానపు ఎండలో బస్సు స్టేషన్ కి చేరింది . ఎండ మూలకంగా దయ్యాలు రెండింటికి  దప్పిక అయి వున్నది . అందువలన అవి బస్సు స్టాండ్లో వున్నా ఏ సి ఓ రెస్టారెంటులోకి అడుగు పెట్టాయి .  మొగ  దయ్యము వాటర్ కూలర్ దగ్గరకు వెళ్లి ఒక గ్లాసు కూల్ వాటర్ తీసుకొని తాగ  బోయింది . ఇంతలో ఒక సర్వర్ వచ్చి దయ్యం చేయి పట్టుకుని ఆపి వేసి "  భోజనం చేస్తేనే మీరిక్కడ మంచినీళ్లు తాగాలి కానీ నీలా కాదు " అంటూ అడ్డు చెప్పాడు  .అంతే కాక   ఓనర్ని పిలిచి పెద్ద హంగామా కూడా చేసాడు . ఓనర్తో  గుడ్ అని పించుకోవాలని .

తింటున్న వారందరూ వీరి వేపు ద్రుష్టి పెట్టారు .  తమ దెగ్గర సరిపడినంత పవర్స్ లేనందువల్ల అవి తమ పవర్స్ ని పొదుపుగా వాడుకుంటున్నవి . మొగ దయ్యము ఆడ దయ్యము మీద డామినేషన్ చేసి మొత్తము పవర్స్ తానే వాడుకుంటూ వున్నది . అందువల్ల మొగదయ్యము ఒక మనిషి రూపములో అందరికీ

కనపడుతూ  వున్నది .  అందువల్ల ఈ
హంగామాఅందరూ చూసే విధంగానే  జరుగుతూ
వున్నది  .
" మేము భోజనము తినటం లేదని ఎవరున్నారు ?
అదిగో అక్కడ మా ఆవిడ భోజనం చేస్తూ వుంది చూడండి
.  " అన్నది మొగ దయ్యము .
" నువ్వు మీల్స్ టోకెన్ కొన్నట్లు నాకు గుర్తు లేదు . మీ
ఆవిడ ఎక్కడనో చూపించు " అన్నాడు ఓనర్ .
అదుగో అటు చూడండి అంటూ వాష్ బేసిన్ మీద వున్నా
అద్దం వంక చూపించాడు మొగదయ్యము . మామూలు
కంటికి కనపడని దయ్యాలు అద్దం లో
కనపడతవి అని రూలు .అందువల్ల ఆ అద్దములో  ఆడ
దయ్యము గాలిలో తేలుతూ, తోకను ఊపుతూ ,
మునక్కాయలంత పొడుగున్న వేళ్ళతో ప్రతి ఒక్కరి
ప్లేటులో ను వున్నా చికెన్ ముక్కలను తీసుకొని- ఉఫ్
ఉఫ్ అని ఊరుకొని   తింటూ కనపడింది. తాను
రుచిచూసి బాగోలేవు అనుకున్న ముక్కలను మనుషుల
నోళ్ల లో పెడుతూ ఆనందిస్తూ వున్నది.
ఒక్కనిమిషము పాటు ఈ దృశ్యము చూసిన వారు
అందరూ కెవ్వుమని అరిచి - భయం తో నెత్తురు కక్కి ,

స్పృహ తప్పి పడి పోయారు . ఇందులో ఓనర్ మరియూ సర్వర్ కూడా వున్నారు .
అందరూ కలిసి నలభై మంది వరకూ స్పృహ తప్పారు . వీరందరినీ హాస్పిటల్కి చేర్చారు . నాలుగు లక్షల బిల్లు అయితే దాన్ని ఓనర్ కట్టాల్సి వచ్చింది .
ఆనోటా ఆ నోటా పడి ఇది దయ్యాలు తిరిగే హోటల్ అని పేరు పడింది .కోటి రూపాయల బ్యాంకు లోను పెట్టుబడితో కట్టిన ఆ ఏసీ రెస్టారెంట్ కస్టమర్లు రాక మూత పడి పోయింది .
దప్పిక వేసిన దయ్యము చేత ఒక గ్లాసు నీరు తాగనించి ఉంటే దేశానికి ఇంత నష్టము జరిగి ఉండదు కదా ? అని అలోచించి ఈ కథ రాసినది - వారణాసి శ్రీ రామకృష్ణ అఫ్ అమరావతి .

—------------------------------------------------------
------

**12.** తమాషా తమాషా గా వుంది కదా ? **19-04-24**

ఒక రాజు గారు వున్నాడు . పేరు తమాషాల రాజు . తమాషాగా ఉంటుందని - రోజుకొక పెళ్లి చొప్పున వరుసగా వందరోజులు పెండ్లి చేసుకొని వందమంది

రాణులను ఏర్పరుచుకున్నాడు . కానీ ప్రతి పెండ్లి తరువాత తొలి రాత్రి అనేది ఒకటుంటుంది- అని మరిచి పోయి నాడు. ఇది కూడా మరిచినాడంటే ఆయన ఎంతో తమాషా మనిషి కావచ్చును . ప్రతి ఒక్క రాణీ , తమకు పిల్లలు కావాలి అంటూ , రాజుగారి ని కోరటం ఎక్కువైంది . రాజుకు తమాషాగా ఆని పించి రాణులకు కావాల్సిన పిల్లల కోసం అని, ఆస్థాన జోతిష్య పండితుని పిలిపించాడు . అయన 101 జాతకాలు పరిశీలించి ప్రతి రాణీకి పిల్లలు పుట్టే యోగము వున్నదని - కాకపోతే - విశిష్ట లక్షణాలు వున్న ఒక వంద ఆవులను తెచ్చి వాటి పాలు పితికి - వాటిని 100 బంగారు కలశాలలో పోసి - ఆ కలశాలను యజ్ఞ కుండము చుట్టూ పేర్చి - యాగాగ్నిలో ఆ పాలు వెచ్చ బడినాక - రాణులు వాటిని త్రాగితే - తప్పక పిల్లలు పుడతారని చెప్పాడు .రాజు ఒకే అన్నాడు .

జోతిష్య పండితుల వారు , తన బంధువుల పెరటి దొడ్ల లో వున్నమామూలు ఆవులను, విశిష్ట లక్షణాలు గల ఆవులు గా చెప్పి - వాటిని ఒక్కొక్కటి మూడు

బంగారు నాణేలకు ధరకు రాజుగారి చే కొనిపించి -
ఒక్కో అవుకు రెండు బంగారు నాణేల చొప్పున తన
ఇంటిలో వేసుకున్నాడు .
యజ్ఞం జరిపి , బంగారు కళాశాలలోని పాలను వేడి
చేసి, రాణులను తాగమన్నారు .అందరూ తాగారు .
కానీ ఒక బంగారు కలశము మిగిలి పోయింది "యజ్ఞ
మహిమ అంటే ఇధే. యజ్ఞ పురుషుడు మనకొక
కలశాన్ని అదనంగా అనుగ్రహించాడు " అన్నాడు
పురోహితులవారు ఒళ్ళు మరిచిన మైకంతో . ఈ
యజ్ఞ కళ సానికి ఇంకా ఎదో అదనపు బహుమానము
రాబట్టాలన్న తమాషా ఆలోచనతో , వళ్ళు మరిచి
అయన అట్లా మాట్లాడాడు అనాలి . యజ్ఞ సిద్ధాంతల
ప్రకారము పాలు ఖాళీ అయినాక ఆ బంగారు కలశాలు
పురోహితునికే చెందుతాయి .కానీ అవి ఆయనకు తృప్తి
నివ్వలేదు . అదొక తమాషా .
" మాకు మామూలు పాలు ఇప్పించి - ఆ యజ్ఞ
పురుషుడు అనుగ్రహించిన పాలు ఎవరికోసం దాచావు
? అని 99 మంది రాణులు పండితుని పై కోప్పడ్డారు
.ఆపై అతడికి శిరఃస్చేదం జరగాలని పట్టు పట్టారు .
ఇప్పటి వరకూ ఈ గుంపులో లేని పెద్ద రాణిగారు

ఇప్పుడు వచ్చింది . నేను అందరికంటే పెద్దరాణిని - నేను వచ్చేదాకా యజ్ఞము ఆపరా?ఎట్లా ? అనుకుంటూ, ఆమె బెట్టు శ్రీ లాగా , కావాలనే ఆలస్యంగా వచ్చింది . వచ్చి- మిగిలిన కలశంలో ని పాలు తాగేసి " నేను రాకుండా నే యజ్ఞము నడిపించిన ఈ పండితునికి శిరఃస్చేదం జరిపించండి "అని రాజుని కోరింది . నా రాణులు వందమంది వచ్చారా లేదా అన్నది లెక్క చూసుకోకుండా యజ్ఞం ప్రారంభించినా కొంప మీదకు తెచ్చినందుకు - మిగిలిపోయిన కలశం గురించి ఏవో కట్టు కధలు చెప్పినందుకు గానూ నీకు శిరఃస్చేద శిక్ష విధిస్తున్నాను అన్నాడురాజుగారు . అలాగా పండితుడి ప్రాణాలు పోయాయి తమాషాగా . గోవులతో వ్యాపారము చేస్తే ఇట్లాగే అవుతుందని, మన గోపాలునిచే ఒక శాపము వున్నది అని గోవులు చెప్పుకున్నాయి .

99 మంది రాణులందరికీ ఒకే రోజున ఒకే సమయాన మొగ పిల్లలే పుట్టారు. ఈ తమాషా పుట్టుకలకు , .పురుళ్ళు పోయలేక ఆయాలు చచ్చి పోయారు . 99 మంది పిల్లలూ మామూలుగా వున్నారు . చివరిగా

పాలు తాగిన పెద్ద రాణిగారికి  ఒక్క రోజు ఆలస్యంతో మొగ పిల్లాడే పుట్టాడు .వాడు భీముడిలా బలంగా వున్నాడు .
పెద్ద రాణీ తాగినది నిజంగా యజ్ఞ పురుషుడు ఇచ్చిన పాలేనని, అందుకే ఆమెకు భీమ బలుడు పుట్టాడని - తాము తాగినవి మామూలు పాలు అని -అందుకే తమకు మామూలు పిల్లలు పుట్టారని -- నిజానికి పండితుల వారు 99 కళాశాలనే పెట్టాడని - చివరి  100 వ  కలశం యజ్ఞ పురుషుడు ఇచ్చినదే నని 99 మందీ రాణులు ఒక తమాషా నమ్మకం ఏర్పరుచుకున్నారు  .
ఈ   తమాషాగా నమ్మకం వల్ల,   పెద్దరాణీకి - చిన్న రాణులకు తగాదాలు మొదలైనవి .

"పిల్లవాడు బలంగా వున్నాడు  ,  వాడి   బలంతో నేను అనేక రాజ్యాలు జయించి చక్రవర్తి అవుతాను "  అన్న ఆలోచనతో తమాషాల రాజుగారు ఈ "భీమ బలుడికి" ఎన్నో అపూర్వ విద్యలు నేర్పించ దలిచాడు  .

భీమ బలుడికివిలువిద్య  విద్యనేర్పే గురువుగారు రాజు వద్దకు వచ్చి "  మీ పిల్ల వాడి నిలువెత్తు బంగారము

నాకు దక్షిణగా ఇస్తే నేను  మీ పిల్లవాడికి "బ్రహ్మ ప్రతాప అస్త్రము " నేర్పుతాను అన్నాడు . ఎల్కేజీ పిల్లాడికి mbbs  నేర్పిస్తాను అన్నట్లు ,  రాజుగాబు   తన ఖజానాలో బంగారము అంతా ఊడ్చి   సమర్పించు కున్నాడు .

మన భీమ బలుడు విలువిద్య సాధన చేస్తూ వున్నాడు . ఇంతలో ఎక్కడినుండో ఒక బంగారు రంగు రాబందు వచ్చి అక్కడ వున్న  ఒక పెద్ద చెట్టు మీద వాలింది . పక్షి  బరువుకు చెట్టు ఒక జాన మందము నేలలోకి దిగి పోయింది .
" నీకు ఏమనిపిస్తున్నది ? అని గురువు భీమ బలుడుని అడిగాడు .
.అటువంటి పక్షిని చూసినపుడు అందరూ అనే విధంగా " అది ఏదో రాక్షస పక్షి మనను మింగటానికి వచ్చింది " అనటానికి బదులు " ఆ  పక్షి ఇహ ఎగరలేక  విశ్రాంతి తీసుకుంటున్నది " అన్నాడు  భీమ బలుడు.   దీనిని బట్టి ఎదుటివాబు  ఎంత భయంకరులైనా - ఎంతటి దుష్టులైనా  వారి పట్ల  సానుభూతి చూపే మనస్తత్వము మన  భీమ బలుని కి   వున్నదని మనకు తెలుస్తూ

వున్నది .                " అదంతా కాదు.  అది ఒక రాక్షసి - దాని మీదకు నీ బ్రహ్మాస్త్రము విడువు " అని గురువు ఆజ్ఞ్యాపించాడు .అయన బ్రహ్మాస్త్రము యొక్క తమాషా చూడ దలిచాడు   " "ఎగిరే రాక్షసి కి మాత్రము విశ్రాంతి వలదా ?"  అనుకుంటూ భీమబలుడు బాణము విడిచాడు . బాణము విడిచే మనిషిలో లేని క్రోధము బాణానికి ఎక్కడనుండి వస్తుంది ?  శివుని కి లేని కోపము అయన మెడలోని నాగుకు ఉంటుందా ? ఎవరినైనా కాటు వేస్తుందా ?   కందకు లేని కత్తికి ఉంటుందా ? అందువలన బ్రహ్మాస్త్రము సున్నితంగా వెళ్లి రాబందు రెక్కల సందున గుచ్చుకుంది . రెక్క మధ్య నుండీ రక్తం కారు తుండగా బంగారు రాబందు ఎగిరి వెళ్లి పోయింది .

తాను ఎంతో ఖర్చు పెట్టి కుమారుడికి ఇప్పించ దలిచిన బ్రహ్మాస్త్రము విఫలం అవటం పై  రాజు గారు కోపించి  . గురువుగారికి దేశ బహిస్కార శిక్ష వేసాడు .

 " మొత్తము వున్న ఖజానా అంతా ఊడ్చి పెట్టి వాడికేదో అస్త్రం నేర్పించావు .

కానీ వాడికి ఆ విద్య అబ్బలేదు . గురువులో ఏమీ లోపం లేదు,  ఇక వాడిని రాజుని చేసే ప్రయత్నం విరమించి మా పిల్లల కు ఆ అస్త్రం నేర్పించు మా పిల్లలే పెద్ద వారు   " అని 99 మంది రాణులు రాజును ఒత్తిడి పెట్టారు . 99  మందీ ఒకే సారి పుట్టారు కాబట్టి ఇందులో ఎవరు పెద్దనో తెలియక రాజు ఆందోళనలో పడ్డాడు . రాణుల ఒత్తిడి తో ఆందోళన లో పడిన  రాజుగారు- బక్క చిక్కి పోసాగాడు  .

  అందుకని భీమబలుడుతండ్రితో " నావల్ల,  నా బ్రహ్మాస్త్రం ప్రయోగం వల్లా మీకు బక్కతనం  కలిగింది కాబట్టి దీనికి నాదే భద్యత . అందుకని   నేను వెళ్లి ఆ బ్రహ్మాస్త్రం ఎందుకు విఫలం అయిందో ? ఈ ఆస్త్రాన్ని ఎదుర్కోవటానికి అని ఆ పక్షి దెగ్గర ఏమి శక్తీ రక్షణగా వున్నదోతెలుసుకొని వస్తాను " అని చెప్పి - ఏవో కొన్ని ఆకులూ అవీ మూట కట్టుకొని - పక్షి రెక్కనుండీ జారిన రక్తపు బొట్ల ఆధారంగా  జాడ తీసుకుంటూ ముందుకు వెళ్ళ  సాగాడు  .
 అలా వెడుతూ ఉంటే, తన పై వున్న ఆకాశం లో  ఎదో మేఘుము వంటిది తనను వెంటాడుతూ వున్నది  ఆని

భీమబలుడు తెలుసు కున్నాడు .నిజానికి అది
మేఘము కాదు . భీమబలుడి చేతిలో దెబ్బతినిన
రాక్షస పక్షి కి వున్న పిల్లల గుంపు . వారు
వందమంది. అందరూ  కూడా ఆడపిల్లలే . ఇందులో
పెద్దది మాత్రమే నిజమైన అప్సరస కన్య . మిగిలిన 99
మంది రాక్షషులు . వీరు 100  మంది కూడా
తెల్లదుస్తులు ధరించి ఒక గుంపుగా ఎగురు తుండటం
వల్ల - వారు  భీమ బలుడికి, ఒక మేఘంలాగా
కనపడుతున్నారు  .ఈ 100  మందీ అచ్చుగుద్దినట్లు
ఒకే రకంగా వుంటారు . తమ తండ్రి ని గాయపరిచిన
వాడిని శపించాలి ఆని అప్సర కన్య వస్తూ ఉండగా ,తమ
తండ్రి ని గాయపరిచిన వాడిని  చంపి తినాలి అని
ఆలోచిస్తూ, మిగతా  99 మంది రాక్షస కుమార్తెలు
కూడా      తెల్ల వస్త్రాలు ధరించి,  అప్సర కన్య వెంట
ఆకాశం లో ఎగురుతూ -  వస్తున్నారు . వీరు కూడా
రక్తపు బిందువుల ఆధారంగానే జాడ తీసుకుంటూ
వస్తున్నారు , భీమ బలుడు కూడా రక్తపు బిందువుల
ఆధారంగానే జాడలు తీస్తున్నాడు కదా ? అందు వల్ల
ఇతడే తమ తండ్రి మీదకు బ్రహ్మాస్త్రము వేసిన వాడని ఆ
రాక్షస- పక్షి   పిల్లలు గుర్తు పట్టాయి . గుర్తుపట్టి తగిన

సమయం కోసం చూస్తూ అతని నెత్తి మీదగా ఎగురు
తూ అతన్ని అనుసరిస్తూ వున్నాయి.
తగిన సమయం రాగానే అవి భీమ బలుడి ముందుకు
దిగి " ఆ మూటలో ఏమి వున్నది ? అది మాకు పెట్టు "
అని అడిగినవి . కయ్యానికి ఎదో కారణం కావాలి కాబట్టి .
భీమబలుడు మూటలో కేవలం ఆకులే కనపడగా "
ఇవేమిటి అని రాక్షస కన్యలు అడిగారు .
" నేను ఒక పక్షిని గాయ పరిచి రక్తం తెప్పించాను . ఈ
ఆకులు నూరి కట్టు కట్టితే ఆ గాయం మానుతుంది . ఆ
పక్షి చక్కగా ఎగురుతుంది" అన్నాడు భీమ బలుడు
.కేవలము పక్షికి కట్టు కట్టే ఉద్దేశ్యముతో ఇప్పటి వరకూ
నూరు యోజనములు శ్రమపడి ప్రయాణము చేసి
వచ్చిన భీమ బలుని,అతని మంచితనము చూసి, ఆ
100 మంది కన్యలూ అతని ప్రేమలో పడి పోయినారు .
అతన్ని తమతో పాటు గాలిలోకి లేపి తీసుకువెళ్లి తమ
తండ్రికి పసరు కట్టు వేయించారు . రాక్షస పక్షి తానూ
కోలుకున్నాక -- భీమ బలుడిని క్షమించి "
బ్రహ్మాస్త్రములో ఏ లోపము లేదు . నీ మంచి మనస్సు
కు ఆ బ్రహ్మాస్త్రము లొంగిపోయింది . నీవు కోపంతో

గనుక దానిని విడిచావంటే అది దాని ప్రభావాన్ని చూపుతుంది " అన్నాడు .
"మీరు వచ్చి నా తండ్రి ముందు ఈ విషయము చెప్పవలెను " అని భీమ బలుడు అడిగాడు . రాక్షషుడు వచ్చాడు . తండ్రి వెంట అతని 100 మంది ఆడ పిల్లలు కూడా వచ్చారు .తన పెద్ద కూతురు అప్సరా మరియూ - భీమ బలుడు ప్రేమలో పడ్డారని తెలిసి వారి వివాహానికి అంగీకరించాడు .కొండంత బంగారము కానుకగా ఇచ్చాడు .
99 మంది రాణులు మొఖాలు మాడ్చుకున్నారు . దీనికి రాక్షసుడు ఎదో ఎదో ఊహించుకొని తన 99 మంది పిల్లలని ఆ 99 మంది రాణుల కుమారులకు ఇచ్చి పెళ్లి లు జరిపించాడు . ఆపెళ్ళిళ్ళు రాణులకు ఇష్టం లేదు . కారణం ఈ 99 మందికీ చర్మము లేదు . పైన కట్టుకున్న వస్త్రములే వారి చర్మము. ఆ వస్త్రాలలోనుండి వారి ఎముకలు కనిపిస్తూ వున్నవి అదీ కారణం . అందువల్ల రాక్చసుడు స్వయంగా పూనుకొని .బలవంతంపు పెళ్లిళ్లు చేయించి తన భారము దించుకున్నాడు . భీమబలుడి భార్య నిజంగా అప్సరా కన్యనే .ఓ ముని ఇచ్చిన వరం వల్ల రాక్చసి కన్యగా

పుట్టిన ఆమె , నిజమైన అప్సర గా మారింది .
అందువల్ల మొదటి రాణి ఎంతో సంతోషించింది . నా 99 మంది సవతుల పొగరు ఇంతటితో ఆణి గింది అనుకొని ఆమె సంతోషించింది .

వందమంది భార్యలు వున్నపుడు వందమంది కొడుకులు, వందమంది కొడుకులు వున్నందుకు గానూ వంద మంది కోడళ్ళు వచ్చారని - అందులో 99 మంది దయ్యాలు ఆని తెలిసి తమాషా రాజుగాబు - తాను 100 పెళ్లిళ్లు చేసుకోవటం గురించి నిజమైన తమాషా ఫీల్ అయినాడు .
వారాణసి శ్రీ రామ కృష్ణ అమరావతి కాల్పనిక రచన
—--------------------------------------------------------------
----

**13.**కరెంటు తీగల పై కాసేపు **18-04-24**

అనగా కరెంటు అఫైర్స్ వైపు కాసేపు అని . రష్యా- యుక్రేన్ మధ్య యుద్ధము జరుగుతున్నది . రెండు రోజుల్లో ముగిసి పోతుంది అని అనుకున్న యుద్ధము రెండు సంవత్సరాలు దాటి పోయింది . అమెరికా మరియూ దాని మిత్రులు

కనుక యుక్రేన్ సాయం ఆపితే ,   తరువాతి   24  గంటలలో తాను యుద్ధము ముగిస్తానని రష్యా ప్రెసిడెంట్ అన్నారు . కానీ సాయం ఆపేటట్లు ఎవరూ కనపడలేదు ఒకరి తరువాత ఒకఋ యుక్రేన్ కి ఆయుధాలు అందించి - నిజమైన యుద్ధ రంగంలో ఎలా పని చేస్తాయో అనే డేటా తీసుకుంటున్నారు .తమ ఆయుధాల గొప్పతనపు అనుభవాలు పొందుతున్నారు .

ఎటు చూసిన యుద్ధము దానంతట అది ముగిసేట్లు కనపడలేదు . ఎవరు వెనక్కి తగ్గితే వారి పరువు పోతుంది కదా ? అదీ కారణం .  . అమెరికా అనుకూల వర్గాలు చెప్పవు కానీ -- ఉక్రేన్ కూడా బాగా నష్ట పోయింది అని . ఈ యుద్ధము గురించి త్తటస్థంగా ఉన్న దేశాలు ఒక అంచనాకి వచ్చాయి .    ఈ మే చివరికల్లా ఐసా పైసా తేలి పోతుందని అంతర్జాతీయ విశ్లేషణలు చెపుతున్నాయి .
ఎవరి పరువుకు భంగం కలగకుండా యుద్ధము ముగిసే దారి ఏమిటంటే?  సంధి ఒప్పందం కుదరటం   . మరి ఈ సంధి ని ఎవరు చేస్తారు ?
యుద్ధము చేస్తున్నదే  అమెరికా - రష్యాలు . అవి తమకు తాముగా సంధికి రావు . చైనా రష్యాకు పడదు . అమెరికాకు చైనాకు పడదు . అందువల్ల ప్రస్తుతానికి మూడో అగ్ర దేశంగా వున్నా  చైనా ఒక సంధిని చేయలేదు .

ఇకమిగిలింది మూడవ అగ్ర రాజ్యం, అనే కిరీటం కోసం పోటీ పడుతున్న భారత దేశము -మరియు దాని విశ్వ నేత . భారత్ ఇటు అమెరికాకి --అటు రష్యాకి సరి సమంగా ఫ్రెండ్ . భారత దేశము వీరు ఇరువురూ కూడా నిర్లక్షం చేయలేని దేశము . అందువల్ల రష్యా- యుక్రేన్ మధ్య యుద్ధము లో ఏదన్న ఒక సంధి కుదర్చటానికి భారత్ కె ఎక్కువ అవకాశాలు వున్నవి . యుక్రేన్ రష్యా విషయంలో భారత్ ఒక తటస్థ వైఖరిని చూపటం ఈ అవకాశాలను రెట్టింపు చేయగల ఒక ప్లస్ పాయింట్ .
భారత్ యొక్క విశ్వ గురువు సమయానికి తగు సంధి మాటలాడి , సంధిని కుదిర్చి - ప్రపంచము లో శాంతి ని నెలకొల్పి, అందుకుగానూ గానూ నోబెల్ శాంతి బహుమతి పొంది తన జీవితమును చరితార్ధము చేసుకోనున్నారు .

రష్యా- -- ఉక్రేన్ మధ్య శాంతి ఒప్పందం చేసి భారత విశ్వగురు నోబెల్ పీస్ ప్రైజు పొందనున్నారని నా జోస్యం . కరెంటు తీగలు పట్టుకుని ప్రేలాడి వాటి ఆధారంగా వాటి మీద ఒట్టేసి మరీ నేను చెపుతున్నాను . మీరు చెప్పండి విశ్వగురు కి నోబెల్ ప్రైజు వస్తుందా రాదా ?

ఉన్నత మైన లక్ష్యాలు ప్రజలకుంటే - నేతలు వాటిని సాధించి చప్పట్లు చరిపించుకుంటారు . ఉన్నత మైన

లక్ష్యాలు ప్రజలకు లేవంటే , తాము సాధించినదే ఉన్నతము అని నేతలు డప్పు కొట్టుకుంటారు

వారణాసి శ్రీ రామకృష్ణ - అమరావతి - స్వంత రచన
—----------------------------------------------------------
-------

14.తగ్గుతూ వస్తున్న /పెరుగుతూ పోతున్న సూచీలు
**17-04-24**

చాలాకాలం క్రితం పచ్చి మట్టి తో ఒక కుండను చేసి - దాని తో నది నుండి నీరు తెచ్చిన స్త్రీ కధలు ఉండేవి .ఇది స్త్రీ శక్తికి ఒక సూచీ కాబట్టి , మనము ఎంతో భక్తి శ్రద్ధలతో వాటిని గ్రంథస్థము చేసుకొని చదివాము .

పచ్చికుండల కన్నా ముందు కాలములో - ఇసుకను పిసికి కుండను చేయటం - వాటితో నీరు తేవటం స్త్రీ శక్తికి సూచీగా ఉండేది .

ఇసుక కుండల కన్నా ముందు కాలం లో - ఆకులతో కుండ చేయటం వాటితో నీరు తేవటం స్త్రీ శక్తికి సూచీగా ఉండేది .

ఆకు కుండ కన్నా ముందు కాలం లో - ఆకు ఈనలతో కుండ చేయటం వాటితో నీరు తేవటం  స్త్రీ శక్తికి సూచీగా ఉండేది .

ఈనలతో కుండ చేయటం వాటితో నీరు తేవటం కన్నా ముందు కాలం లో, ప్రత్తితో కుండలు చేయటం  వాటితో నీరు తేవటం  స్త్రీ శక్తికి సూచీగా ఉండేది .
ప్రత్తి  కుండకన్నా ముందు కాలం లో నీటిని పిసికి కుండ చేయటం వాటితో నీరు తేవటం  స్త్రీ శక్తికి సూచీగా ఉండేది .
నీటిని పిసికి కుండ చేయటం ముందు కాలం లో- నీటి బిందువును సాగదీసి లేదా దానిలోకి గాలి ఊది  దాన్నే కుండగా మార్చి వాటితో నీరు తేవటం  స్త్రీ శక్తికి సూచీగా ఉండేది .

చూచారా ? - కాలం గడుస్తున్నా కొద్దీ స్త్రీ శక్తీ యొక్క సూచీ పడి పోతూ వున్నది .

నీటి   బిందె మోయలేక పోవటంనేడు స్త్రీ శక్తికి సూచీగా వుంది .

- " ఏమండోయి .. ఇలా వచ్చి ఆపంపు కింద బిందె తెచ్చిఈ స్టవ్ గట్టు మీద పెట్టండి" అని ఆర్డర్ వేయటం నేటి స్త్రీ సెక్తికి సూచీగా వున్నది . ఈ సూచీ ఇంకా ఎక్కడికి పోతుందో ఏమో మీ ఊహ కేమన్నా అందుతున్నదా ?

పూర్వపు రోజులలో , ఎంతటి వారైనా సరే , ఎంత చిన్న వారినైనా సరే - వారు చేసిన పనిని మెచ్చి వెన్ను తట్టి ప్రోత్సహించే వారు .

తరువాత రోజులలో ఎవరికైనా , ఏదైనా ప్రోత్సాహం లభించటం అపురూపం అయి పోయింది . ప్రోత్సహించే వారు లేక మేధావులు వలస పోయారు .
ఈ మధ్య కాలంలో "లైకుల " సూచీ రేటు ఓ తెగ పెరిగి పోతూ వుంది .
ఒక్క కామెంట్ = వేయి లైకుల సమానము అని, ఒక్క లైకు = వంద మంది చదివిన దానికి సమానము అనుకోవాల్సి వస్తోంది . ఈ సూచీలు డాలర్ టూ రూపాయ మార్పిడికి వున్నా వేగంతో దూసుకు పోతున్నాయి
వారణాసి శ్రీ రామ కృష్ణ {అమరావతి} స్వంత రచన

a original by VARA NASI SREE RAMA KRISHNA

—-----------------------------------------------------------------
--

**15.**దొండ కాయ వేపుడు సిద్ధాంతము **14-04-24**

అత్తా గారు బిత్తరి చూపులు చూస్తూ ఉండగా - కోడలమ్మ గారు దొండకాయను రెండు అడ్డ ముక్కలు గా చేసి భాండీలో పడవేస్తూ వున్నది .

చూసి ఓర్చుకోలేని అత్తగారు " అమ్మా ఈ నీ పుట్టింటి వారు నీకు ఏమి నేర్పారో ఏమో కానీ -దొండకాయను ముందు నాలుగు నిలువులుగా కోసి అప్పుడు వాటిని అడ్డంగా కోసి కాయ కాయకు ఎనిమిది ముక్కలు తెప్పించాలే . అదే తరతరాలుగా మనము కూర వండుకుంటూ వున్నా విధము " అని చెప్పింది .

కోడలు ఏమన్నదీ అంటేనూ " అత్తా నీ కు అరవై వచ్చినవి . నన్ను ఆరళ్ళు పెట్టటం తప్ప నీకు వేదాంతం వంట పట్ట నే లేదు . దొండ కాయలను , చేపల ను ఎలాంటి ముక్కలు తరిగిన గానీ అవి నోటిలోనుండి నిట్టనిలువుగానే లోపలి కి పోతవి . ఎక్కడ అడ్డం తిరగాలి

అనుకుంటావో అక్కడనే అడ్డం తిరిగి - ఎట్లా బయటకు రావాలనుకున్నా వో అట్లాగా నే బయటికి వస్తువి . మధ్యన మీకూ నాకూ ఎందుకు ఈ రగడ ?హాయిగా వారణాసి కి పోయి రామా కృష్ణ అనుకోండి " అన్నది

—-----------------------------------------------------------

--

.**16.**నాలుగు మందిరాలు -అనేక దారులు **12-04-24**

జపాను చక్రవర్తి క్రింద అనేక మంది రాజులు - అందులో ముగ్గురు అతి ముఖ్యులు .
ముగ్గురిలో, మొదటి రాజు యొక్క బలమే చాలును - చక్రవర్తి గారిని ఎదిరించి ఓడించటానికి . రొండో రాజు , మూడవ రాజు యొక్క బలము కలిపితే మొదటి రాజు బలమునకు సమానము .
ఈ ముగ్గురూ కూడా మంచిబాల్య స్నేహితులు . వంశ పరంపర్యముగా వీరికి చక్రవర్తి అంటే ఎనలేని గౌరవము .అయన ఆజ్ఞను జవదాటరు . కానీ ఈ ముగ్గురు స్నేహితులుగా ఉండటం చెక్రవర్తిగారికి కోపము . ఆ ముగ్గురు కలిసి తనని కూల దోస్తారేమోనని భయము . ఈ భయముతో ఆయనకు నిద్ర పట్టేది కాదు .

ఒకనాడు చెక్రవర్తి గారు రెండు మరియూ  మూడో రాజుకి "
మీరు రేపే వచ్చి  నా పాదాలకు మొక్కి నా అశీసులు
తీసుకోండి  " అని కబురు పంపాడు . రాజులు ఇరువురు
కల్సి ఏటో పోయే ప్రయాణ ము మానుకొని - చక్రవర్తి వంక
మళ్ల వలసి వచ్చింది . వారికి సమయము చాలలేదు ది
.అందువల్ల వారు చక్ర వర్తి అడిగిన విధంగా హాజరు రాలేక
పోయారు .

చెక్రవర్తి అసలు ఉద్దేశ్యం ఏమిటంటే ? ఎదో ఒక సెపము
కల్పించుకొని ఆ ఇద్దరినీ చంపివేయాలని . చక్రవర్తి
వాస్తవమును యదార్ధమును పక్కన పెట్టి - కేవలం  తన
మనసులో వున్నది సాధించతలచిన దృష్టితో మొదటి
రాజుకు ఇలా కబురు పంపాడు  " నీవు మన రెండో
మరియూ మూడో రాజు పైన యుద్ధానికి వెళ్లి వారిని
జయించి వారిని బందించి తెచ్చి నా కాళ్ళ ముందు
పడవేయి " అని . దీని వెనుక చక్రవర్తి ఆలోచన
ఇలావుంది."దీనితో ముగ్గురు రాజులకూ  మిత్ర త్వము
చెడుతుంది . పైగా తనకు దీటు రాగాల మొదటి రాజు
తనకు ఆజ్ఞకు ఎప్పటికీ లోబడి ఉన్నాడా ?లేదా? అన్నది
కూడా తెలుస్తుంది . ముగ్గురిలో ఎవరు చనిపోయినా నాకు
ఒక శత్రువు తగ్గినట్లే" . అన్నది చక్రవర్తి ఆలోచనా తీరు .

మొదటి రాజు తన మిత్రుల మీద యుద్ధము నకు వెళ్ళాడు . వారు చెక్రవర్తి ఆజ్ఞను పాలించటంతో గల ఇబ్బందులను తెలుసుకున్నాడు . వారు కూడా "చక్రవర్తి ఆజ్ఞను పాలించటంలో మా లోపమే వున్నది అని ,ఒప్పుకొని, మా లోపము వల్ల యుద్ధము , రక్తపాతము జరగరాదని కోరుకుంటూ వున్నాము " అని చెప్పి తమ మిత్రుని కి లొంగి పోయారు.

తన మిత్రులను బందీలుగా చేసి తెచ్చిన మొదటి రాజు- వారిని చెక్రవర్తి పాదాల మీద పడవేసి " తమరి ఆజ్ఞను మన్నించనందుకు వీరిని క్షమించి విడిచి పెట్టండి " అని విన్నపము చేసాడు . ఇట్లా చేస్తే వారి స్నేహం మరింత ధృడ పడుతుందన్న ఆలోచనలో పడ్డ చక్రవర్తి ఆ విన్నపము పట్టించుకోక " నా కళ్ళ ముందే ఈ ఇద్దరి తలలు తెగ నరుకు " అని అజ్ఞ్యాపించాడు . శత్రు సమాహారమే చక్రవర్తి కోరిక అయ్యింది. ఆయన లో మంచి తనమూ లేదు మానవత్వము లేదు - క్షమా గుణమూ లేదు. .తన సామ్రాజ్యమును సుస్థిరం చేసుకోవాలన్నా కోరిక తప్ప ఇంకేమీ లేదు . రక్త పాతానికి వెరవటం లేదు . ఇవి బుద్ధ భగవానునికి నచ్చని గుణములు .

చెక్రవర్తి యొక్క మొండి ఆజ్ఞ మీద, మొదటి రాజు తన మిత్రుల తలలు నరికి చంపాడు . ఆ సమయములో వారు చేతులు వెనక్కి విరిచి కట్టి వేశారు . వారు మీద మీద పడుతున్న కత్తికి చేతులు అడ్డు పెట్టి వేడు కోలేని దీన స్థితిలో వున్నారు . దేమునికి తుది నమస్కారము చెప్పలేని దైన్య స్థితిలో కూడా వున్నారు. .
అసలే మిత్రులు - వారు అతి దీన స్థితిలో ఉండగా వారిని సంహరించాను అని మొదటి రాజు పాస్చాత్తాపంతో మునిగి వోయాడు .ఆయన అన్య మనస్కంగానే రాజ్యం చేసి తుదకు మరణించాడు . శత్రు భయం తీరింది అన్న సంతోషం తో రాజ్యం చేసిన చక్రవర్తి మాత్రం ఆగుతాడా ? అయన కూడా మరణించాడు .

చక్రవర్తి జరిపిన మారణ కాండవలన రాజులు ముగ్గురూ చెక్రవర్తికి విధేయులే అని రుజువు అయ్యింది కదా ? . ఈ నలుగురి పుత్రులు రాజ్యాలు చేపట్టి మంచి మిత్రు లైనారు .బౌద్ధ మాట అవలంభకులు అయినారు . చెక్రవర్తి కొడుకు తన మిత్రులను తనతో సమావేశ పరిచాడు .

.తండ్రి పేరున ఒక బౌద్ధ మందిర నిర్మాణానికి పూనుకున్నాడు .

చక్రవర్తి కొడుకు ఇట్లా అన్నాడు " మీ పట్ల .హింసకు పాల్పడిన నా తండ్రి ఆత్మ క్షమించ బడినదో లేదో . అయన స్వర్గము చేరినాడో ? లేదో? అనే చింత నాకు కలుగుతూ వున్నది . నేను నా తండ్రి ఆత్మ శాంతి కోరి ఒక పెద్ద బుద్ధ మందిరాన్ని నిర్మించ నున్నాను.ఈ మందిరంలో నా తండ్రి చేసిన పాపాలను ఒక శిలా శాసనం ద్వారా బహిరంగ పరిచి ,ఆయనకు బుద్ధుని నుండీ , ప్రజల నుండీ క్షమాపణలు ఇప్పిస్తాను . క్షమ మూలంగా నా తండ్రి ఉత్తమ గతులకు పోవాలి అని నేను కోరు కుంటున్నాను . నా తండ్రి అకృత్యానికి నేను మీ క్షమాపణలు అడుగుతున్నాను. మీరు ముగ్గురూ కూడా మీ తండ్రుల పేరిట నా తండ్రి మందిరము పక్కనే మీ తండ్రుల మందిరాలు నిర్మించుకో వచ్చును " అని సూచన చేసాడు

మొదటి రాజు కొడుకు " అవును - మిత్రులను వధింప వలసి వచ్చినపుడు నా తండ్రి ఆత్మ ఎంత క్షోభించినదో ఏమో ? ఆయన ఆత్మకు శాంతి కోరి నేనూ నా తండ్రి పేరిట ఒక మందిరాన్ని నిర్మించుతాను" అనుకోని రెండో బౌద్ధ మందిర నిర్మాణానికి పూనుకున్నాడు .

రెండు మరియూ మూడవ రాజు యొక్క కొడుకులు " పగ సాధించవలెను అన్న కోరికతో, శాంతి లేక , మా తండ్రుల

ఆత్మలు  స్వర్గమును చేరక పోయి ఉండవచ్చును .   వారి ఆత్మ లోని  పగ ను రూపు మాపి వారి ఆత్మకు  శాంతి చేకూర్చమని  ఆ బుద్ధిని వేడుకుంటూ మనమూ  బౌద్ధ మందిరాల నిర్మాము చేద్దాము  " అనుకున్నారు . ఇట్లా మూడు నాలుగు మందిరాలు నిర్మితమైనాయి

చెక్రవర్తి కుమారుడు రాజులతో "  నా తండ్రి వలన మీకు జరిగిన  అన్యాయాలను బహిరంగ పరుచుకుంటూ ఈ మందిరాలలో శిలా శాసనాలు వేసుకోండి  " అని మరొక సూచన చేసాడు .  తమ తండ్రులు  ఏరకంగా అన్యాయానికి గురి అయినది వివరిస్తూ బుద్ధ మందిరం తో పాటు శిలా శాసనాలు వెలిశాయి .ఈ శిలా శాసనాలతో పాటు ఆ నలుగురికి  స్మారక మందిరాలు కూడా  వెలిశాయి .
- -ooo--
రాజులు తమ  బౌద్ధ  మందిరాలు కొండలపైనే ఎందుకు కట్టిరి ? అని మీకు అనిపిస్తే -- ఇది చదవండి .
" ఒక చెట్టు మీదనో - కొండ పగులులోనో పక్షి పిల్లలను చేస్తుంది  .పక్షి ఎగరటానికే పుట్టింది . అది తన  జీవిత పర్యంతమూ ఎగురుతూనే వుండవలె . ఇలాంటి పక్షికి కూడా ,  ఎగరటం గురించి న మొదటి పాఠము ఒకటి ఉంటుంది . వాటి     తల్లి - తండ్రి - పక్షులు ఆ పాఠము  అవి నేర్పిస్తూ ఉంటవి . అయిన ను  వాటికి దేముని కృప కూడా

ఉండవలెను  కదా ? అనగా దేముడు నేర్పిన పాఠము
కూడా ఒకటి ఉండవలెను అని అర్ధము . ఆ కృపను లేదా
పాఠాన్ని బుద్ధుడే అందచేస్తాడు .
- -ooo--
పాఠాన్ని బుద్ధుడే ఎందుకు చెపుతాడు  ?
దేవతలకు కూడా పిల్లలు వుంటారు కదా ? మరి ఆ పిల్ల
దేవుళ్ళు కూడా గాలిలో ఎగరవలె కదా   ? తోలి రోజుల్లో
వారు కూడా పిల్ల పక్షుల వంటి వారే . మొదటిగా
ఎగిరేటప్పుడు వీరికి   వారి తల్లి తండ్రులే పాఠాలు చెపుతారు
, మెళుకువలు నేర్పుతారు . కానీ పిల్ల దేవతలు  ఎగరటం
లో   దేవుని దయ అవసరం లేదా ? తప్పక వున్నది .
బుద్ధుడు దేవాది దేవుడు .అయన కరుణా గుణము- క్షమా
గుణము  అందరూ ఎరిగినదే. అందువల్ల  బుద్ధుని తో పాటు
స్వర్గం లో నివాసము వుండే దేవీ దేవతలు అందరూ , --
తమ పిల్లలు ఎగిరే టప్పుడు బుద్ధభగ వానుడు  వారిని
గమనిస్తూ వుండి ,వారిని ప్రేమతో రక్షించి , వారు తప్పులు
చేస్తూ ఉంటే కరుణతో  చక్క దిద్ది , వారు  సురక్షితంగా
ఎగిరేటట్లు  చూడమని  బుద్ధుని వేడుకుంటూ వుంటారు  .
ప్రేమ -కరుణ -క్షేమము - శాంతిని అందించటంలో బుద్ధుని
మించిన వారు లేరని , ఈ సర్వ దేవతల నిర్ణయము వలన
మనకు తెలుస్తున్నది .

ఎగరటం నేర్చుకోవాల్సిన వారెవరైనా సరే ఒక పెద్ద ఎత్తు నుండి కిందకు దూకటం ద్వారా దాన్ని మొదలు పెట్టక తప్పదు . అందువల్ల దేవతల పిల్లలు ఎగరటం నేర్చుకోవటానికి అని కొండ శిఖరాలకు వస్తాయి . వారి ఆయు క్షేమం వహించటానికి అని బుద్ధ భగవానుడు కొండ శిఖరాల పై కి వచ్చి కూచుంటాడు . అయన తరచూ వచ్చే ప్రాంతము కొండలు కాబట్టి-- బుద్ధ మందిరాలను కొండ ల పై కడతారు . ఈ మందిరాలను సందర్శించి తనను ప్రార్ధించే వారి ప్రార్ధనలను బుద్ధుడు ప్రత్యక్షంగా వినే అవకాశం వున్నది కదా ?

మనము ఎవరి గురించి ఐతే ప్రార్ధన చేస్తున్నామోచేస్తూ ఉన్నామో - వారు మరణించిన పిదప వారి ఆత్మలు స్వర్గం వైపు ప్రయాణించుటకు ఆసక్తము లైతే { చేసిన పాపాల కారణంగా అశాంతి / ఆవేదనతో ఆసక్తములు ఐన ఆత్మలు } బుద్ధ భగ వానుడు వాటి తప్పులను క్షమించి , శాంతి కలిగించి, ఆవేదన తగ్గించి అవి స్వర్గం వైపు ఎగిరి వెళ్లే టట్లు గా పాఠము చెపుతాడు . మార్గ శక్తి కల్పించుతాడు .

మనిషి తాను బ్రతికి వున్న రోజులలోలో నే తాను చేసిన పాపాలను గ్రహించి వాటిని ప్రక్షాళన చేసుకొని ఆత్మకు శాంతి కల్పించుకోవాలి - లేదంటే అతని వారసులు అయినా

సరే అతని పాప కార్యాలను బహిరంగ పరిచి , ప్రజలనుండి మరియు బుద్ధుని నుండి - దివంగతుని ఆత్మ కు క్షమా దానము చేయించ వలెను . తన మరణానంతరము ఐన సరే తన పాపాలు బహిరంగపరచ బడతాయి అన్న భయం వున్న మనిషి ఎంత ఉదాత్తంగా జీవించటానికి అవకాశము వున్నదో ఆలోచించండి .

--oo-- నానా దారులు ఏమిటి ? --00

ఇప్పుడు నాలుగు మందిరాలు పెలిసినవి కదా ? వాటిని కట్టిన వారు అక్కడకు పెళ్ళుటకు గానూ ఏవో దారులు కల్పించు కొక వుండరు కదా ? ఇహ మామూలు వస్తువులు పైకిచేర్చు కొనుటకు ఒక నడక దారి - భారీ వస్తువులను పైకి చేర్చు కనుటకు ఒక దారి వుండునే ఉండును . అట్లే గుఱ్ఱములు ఎక్కుటకు ఏనుగులు నడుచుటకు వేరే దారులు చేయుదురు . కుదుపులు లేకుండా రాణి గారి పల్లకి పోవుటకు ఇంకో దారి కల్పింతురు . కూలీలు నీరు తెచ్చుకొనుటకు అని, కొండ వాగులు , కొలనుల వద్దకు దారులు చేయుదురు .ఇట్లా ఒక కొండ పైకి ఎన్ని దారులైన ఉండవచ్చును . వున్న ప్రతి దానికి ఒక ప్రయోజనము ఉండును. అందువలన ఏ దారినీ నిర్లక్షం చేయ రాదు . కానీ మానవ నైజము ప్రకారము అనేక దారులు నిర్లక్ష్యం చేయబడును . అవి మనకు మోక్షమును

శాంతిని ఇచ్చు టకు అని పెద్దలు చూపిన నమ్మతగిన దారులు కూడా కావచ్చును .

పెద్దలు చూపిన దారులు మరిచి పోరాదన్న స్ఫూర్తి జపనీయులకు వున్నది .
వీరు తమ నిజ జీవితములో కొండలకు పోయే దారులను దత్తత తీసుకొని ఆ దారులను శుభ్ర పరుస్తూ , ముళ్ళు ఏరివేస్తూ వాటిని బాటసారులకు అనుకూలంగా, సురక్షితంగా మార్చి బుద్ధుని సేవిస్తూ వుంటారు .ఒక్కో అప్పుడు ఎవరో ఎందుకో వేసిన కఠిన మార్గాలు కూడా కనపడతవి , జపనీయులు ఆ మార్గాలలో ఆహారము - నీరు ఉంచుతారు , ఆ దారులలో చిన్న పిల్లవాడి రూపంలో వున్న బుద్ధ ప్రతిమలను కూడా నిలుపుతారు . ఇది ఎందుకంటే పర్వతాన్ని ఎక్కే వారు తమ ఇంటి పిల్లలనూ బుద్ధుని పోల్చుకొని మానసిక ఆనందము పొందాలని .
మేము దారి తప్పి/ మరిచి అటు పెళ్లగా అక్కడ మాకు బుద్ధుని రూపము కనపడింది- అని కొందరు చెపుతూ వుంటారు . అప్పుడు అటువైపు కూడా మార్గాలు నిమిస్తారు . ఏమి జరుగుటకైనా అవకాశము వున్నది అని నమ్మిన వారికే ఇలాంటిది సాధ్యము . ఈ ధ్రుష్టి వల్లనే జపనీయులు ఎంతో సాంకేతికత వృద్ధి చేసుకున్నారు . కొన్ని కుటుంబాలవారు - బండ మెట్ల పక్కాగా ఉండేటట్లు చెక్క

మెట్లు నిర్మించి పెడతారు . బండమీద కాలు జారినట్లు ,
చెక్క మీద కాలు జారదు కదా ? ఎముకలు విరగవు కదా ?
అందుకని . ఆకుటుంబాలవారే ఫది సంవత్సర్రలకు ఒకసారి
ఆచెక్కలన్నీ  తొలగించి కొత్త చెక్కలు అమరుస్తారు . ఆ
దారిని కేవలం పది మందే వాడారు అని రుజువు అయినా
గానీ ఆ పునర్ నిర్మాణము ఆపరు. ఎవరు కోరుకునే మార్గం
వారికి లభించేట్లు చూడటమే మానవత్వము .
మనకు కొత్త దారుల నిర్మాణము పై  ద్రుష్టి ఉండదు .
వున్నవాటిపై న లక్షం ఉండదు . మరుగు బడిన మార్గాలు
కైలాసమునకు పెళ్లనట్లే . మార్గము  యొక్క లక్షణము
ఏమిటో కూడా మనకు అర్ధము కాదు . అది రకపు
మార్గము ఐన సరే .

 దీని లోని ప్రతి మాటా నా సొంతమే - దీనిని మీరు
ఆనందించి వుంటారు-  అని నమ్ముతూ వున్నాను

A ORIGINAL BY VARANASI SREE RAMA
KRISHNA
—------------------------------------------------------------------

**17.**ఆవు మీద ఒక వ్యాసము – **10-04-24**

నేనూ  ఒకాయన { ఈయన ఎవరో తరువాత చూసుకుందాము  } కలిసి మొక్కలు కొనటానికి అని మొక్కలు అమ్మే అమ్మన్న రాజు నర్సరీకి వెళ్ళాము .

అది ఐదు ఆరు ఎకరాలలో విస్తరించి వున్న  నర్సరీ . మేము లోపలి పోయిన సమయానికి , అందులో  ఒక ఆవు మొక్కల మధ్యగా తిరుగుతూ వున్నది .  మొక్కలన్నీ ప్లాస్టిక్ సంచుల్లో పెట్టి వాటిని నేలమీద బారులుగా అమర్చారు . ఆవు వాటి మధ్య గా  తిరుగు తూ వున్నది  .
" ఏమి కావాలండీ " అంటూ ఒక పని వాడు మా వద్దకు వచ్చాడు
.
" ఆవు ఇట్లా మొక్కల మద్ధ్య తిరుగుతున్నదేమి ? మొక్కలు నమిలి వేయదా ?  అని మేము ఖంగారుగా  అడిగాము . ఖంగారు అనేది ఒక దురద . దాన్ని ఆపుకునే దారి ఉండదు .  సరే దురద ఉండటం కూడా ఒకఅందుకు మంచిదే . గోళ్ల పని తనము వేళ్ళ పనితనము  తెలుస్తుంది . కంగారు వల్ల కొన్ని విషయాలు తెలుస్తాయి .
    " సార్ -- ఆవు ఏదైనా తేలిగ్గా నేర్చుకుంటుంది,  తేలిగ్గా బోధ పరుచుకుంటుంది . మాకు కావాల్సింది మేము దానికి నేర్పాము - దానికి కావల్సినది అది నేర్చు కున్నది . మీరేమీ ఖంగారు పడవద్దు . అది అలా మొక్కల మధ్య తిరుగుతూ మొక్కలను తినకుండా , కేవలం నేలమీద మొలచిన గడ్డి మాత్రమే తింటుంది . మాకైతే నేలమీద పెరిగిన గడ్డి పీకటానికి అని  ఒక కూలీ కావాలి కదా ? . అందువల్ల మా యజమాని దానిని  పెంచుతూ దాని చేత

గడ్డి పీకే  కూలీ పనిచేయిస్తూ ఉంటాడు .  ఇప్పుడు ఆవు గడ్డి పీకే కూలీ పని చేస్తున్నది " అని  అన్నాడు . నిజమే ఆవు గడ్డి పీక్కుని తింటూ -  కలుపు తీస్తూ వున్నది .

"ఇప్పుడు ఆవు కూలీ పని చేస్తున్నది " అని అతడు అనటంలో ఆవు ఇంకా ఏవో పనులు చేస్తూ వున్నదని అర్ధం కూడా వున్నది కదా ?

మేము ఒక ప్రక్కగాను ఆవుకు కొంచం దూరంగా  ఉన్న మొక్కల వంక వెళ్ళాము   " ఇవి ఏమి మొక్కలు ? వీటి విశిష్టత ఏమిటి ?" అని అడిగాము .

" వీటిని ఆవులు వంటి  పసరాలు  తినవండి . ఈ మొక్కలు నాటు కుంటే దాన్ని పశువులు తినకుండా మీరు వేరే   కంచె వేసుకోవాల్సిన పని ఉండదు . అలాగా  మీకు చాల డబ్బు ఆదా అవుతుంది . టెస్టింగ్ కోసం అని  ఆవును పిలవమన్నారా ? అని అడిగాడు .
ఆవు ఇప్పుడు యజమాని తరఫున "సాక్షి"   అయ్యింది . శివుని విషయం లో కూడా ఆవు " సాక్షం"  చెప్పిందికాదా . ఇప్పుడు కూడా అలాగా అన్నమాట .

మేము మరొక  ప్రక్కగాను , ఆవుకు ఇంకా కొంచెం    దూరంగానూ , ఫెన్సింగ్ లోపలనూ ,  పెంచ బడుతూ  ఉన్న మొక్కల వంక వెళ్లి " ఇవి ఏమి మొక్కలు ? వీటి విశిష్టత ఏమిటి ?" అని అడిగాము .

" వీటిని ఆవులు ఇతర పసరాలు చాలా ఇష్టంగా తింట వండి .ఆవు తింటున్న కొద్దీ చెట్టు ఎదుగుతూ ఉంటుంది. మీరు ఈ మొక్కలు పెంచుతూ ఉంటే , దాన్ని ఆవులు తింటూ ఉంటే - మీబు చాల డబ్బు ఆదా లో ఎన్నో ఆవులను పోషణ చేయవచ్చు . పుణ్యము కోసమని మీరే మీ ప్రత్యేకముగా ఖర్చు పెట్ట పని లేదు . టెస్టింగ్ కోసం ఆవును పిలవమన్నారా ? అని అడిగాడు . ఇప్పుడు అనిపించింది ఆవు ఎదో మంచి టెస్టింగ్ జాబులో ఉందని.

మేము కొన్ని మొక్కలు ఎన్నిక చేసుకొని యజమాని వద్దకు వెళ్ళాము " మీ బిల్లు మొత్తము వేయి దాటలేదు . దాటితే, అందులో ది ఐదు శాతము గో గ్రాసము కింద పెచ్చించి తౌడు కొని దానికి తిని పిస్తాము " అన్నాడు ఆ నర్సరీ యజమానిఅమ్మన్న రాజు . పెనక్కు చూస్తే ఆవు వస్తూ కనపడింది . బిల్ పేమెంట్ అవటం గమనించి అది వచ్చిందా ఏమో ? అయన ఒక గుప్పెడు తౌడు తీసి ఒక గిన్నెలో పెట్టాడు . ఆవు వచ్చి తిన్నది . మాకు ఎంతో ఆనందము వేసి - మళ్ళా నర్సరీ లోనికి పెళ్లి మొత్తము రొండుపేల రూపాయ ల మొక్కలు కొన్నాము . 2000 లో అవుకు ఎంత వస్తుంది ? ఒక 100 నే కదా ? అని మేము విచార పడ్డాము . డబ్బు చాలితే ఇంకా కొనే వారమే . ఆవు ఇప్పుడు సేల్స్ ప్రమోటర్ అయ్యింది .

నా పక్కన ఉన్న ఆయన మా ఊరి స్కూల్ హెడ్ మాస్టర్ . నాకన్నా చిన్నవాడు. నేను ఆరులో వున్నపుడు నాదెగ్గరనుండి ఎక్కాలు చెప్పించుకున్నవాడు . స్కూల్ లో నాటాల్సి

మొక్కలకోసం వచ్చాడు . ఆ యన నావంక తిరిగి " ఈ  ఆవు మీద ఒక వ్యాసం రాయండి .  ఆవు మీద వ్యాసాలు రాయుము అనే  ప్రశ్నను బ్రిటీష్ వాడే ప్రవేశ పెట్టాడు అనుకుంటాను  . వాడి ఉద్దేశ్యము ప్రకారము ఆవు కు నాలుగు కాళ్ళు ఒక తోక , రొండు చెవులు వున్నవి,  అని రాయమని కాదు అనుకుంటా ను . ఎక్కడ ఉన్న ఆవు ఎట్లా బ్రతుకుతున్నది అనేది పరిశీలించి తెలుసుకొని, ఆ సంగతులు ఏమిటో  రాయమని కావచ్చును. ఆవు ఇండియాలో బ్రతికినట్లు గానే అమెరికాలోనూ, ఇంగ్లాండ్ లోనూ  - ప్రపంచం  అంతటా నూ   కూడా బ్రతుకుతున్నదా ? లేదా ? "అనే జ్ఞ్యానం  తెలుసుకునేందుకె కాబోసు  , వాళ్ళు మన బడి పిల్లలను "ఆవు మీద వ్యాసము రాయుడు " అని అడుగుతూ ఉండేవారని   నాకు ఇప్పటి అర్ధం అయినది . ఈ వ్యాసాల గురించి   గైడ్లు రాసే వాళ్ళు -- వాళ్ళు చెడింది కాక పిల్లలని చెడకొడుతూ వున్నారు " అని ఆయన యాష్ట పడ్డాడు . నేను దీనితో ఏకీభవించానో లేదో నాకే తెలీదు . ఎదో హెడ్ మాస్టారు గారు అనే మర్యాద కల కుంక - నాకన్నా చిన్న వాడు - వాడు వ్యాసము రాయలేక నన్ను అడిగాడు కదా ? అని అలోచించి , ఆవు మీద ఈ వ్యాసము రాసాను .

వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి స్వంత రచన



Varanasi sree rama krishna on 28-4-24

You can contact me on 6301796990 or 9908482191